శ్రీః

స్వధర్మే నిధనం శ్రేయః.

శ్రీ చిదానన్ద సరస్వతీ శ్శరణం భవతు.

# మతదర్పణము.

బ్రహ్మశ్రీ పెమ్మరాజు సీతారామయ్య దీక్షితులవారిచేత
రచియింపఁబడినది.

స్వధర్మప్రకాశినీ పత్రికాధిపతులచేత ప్రకటింపఁబడినది.

బృందావనము కీలుపాకు, మదరాసు.

౧౯౨౯ జూను నెల

శుక్ల సంవత్సర జ్యేష్ఠమాసము

వెల ౦-౪-౦ అణాలు.

## మాయొద్ద విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములు.

| | రు. | అ. |
|---|---|---|
| ౧. తైత్తిరీయ స్మార్తబ్రాహ్మణ నిత్యకర్మాష్టకము. టీకా తాత్పర్య, సస్వరాంధ్రప్రయోగము. అట్టబైండు. | 2 | 8 |
| డిటో క్లాత్ బైండు. | 3 | 0 |
| డిటో గాయత్రీ చిత్ర పటసహితము లైబరియడిషన్ | 4 | 0 |
| ౨. త్రికాల సంధ్యావందనము:-టీకాతాత్పర్య సస్వరాంధ్ర ప్రయోగము. గాయత్రీ చిత్రపటసహితము. | 0 | 6 |
| ౩. మంత్రపుష్పత్రయము:—"సహస్రశీర్షం, యోపాంపుష్పం వేద, జాతవేదసే" అను మంత్రములకు విద్యారణ్యభాష్యము, తెలుఁగు టీకాతాత్పర్యములుగలవు. సస్వరము. | 0 | 4 |
| ౪. గృహస్థకంఠాభరణము:—సాంధ్రతాత్పర్యము, ఇందు ప్రాతస్స్మరణము, పతివ్రతాలక్షణము, సతీచర్య అను మూఁడువిషయములు గలవు, చదువనేర్చిన ప్రతివారును జదువఁదగ్గ గ్రంథము. | 0 | 5 |
| ౫. సహధర్మిణీచర్య:—వాత్స్యాయనముని కామశాస్త్రము నుండి సంగ్రహించి యాంధ్ర టీకాతాత్పర్యములతో ముద్రింపఁబడియున్నది స్త్రీలందఱును జదువఁదగినది. | 0 | 4 |
| ౬. సంఖ్యార్థనామప్రకాశిక:—వచనము. ఇందు సకల విషయములును సంఖ్యాక్రమమునఁ గలవు. | 1 | 0 |
| ౭. లావణ్యమయి:—సంస్కృతనవల ప్రతిసంస్కృత విద్యార్థియుఁ జదువఁదగిన గద్యగ్రంథము. | 0 | 3 |
| ౮. ఆబ్దికమంత్రములు:—టీకా తాత్పర్యము సస్వరాంధ్ర ప్రయోగము. ౧౭౦ పుటలు. దీనియందు ప్రాయశ్చిత్తోపాసన, ఔపాసనవిధి, శ్రాద్ధాంగతర్పణము, అన్నసూక్తము, పురుషసూక్తము, అథిశ్రవణము, పిత్రధ్యాయములు మున్నగునవిగలవు. వేయేల ఆబ్దికవిషయమైన సంగతులెన్నో దీనివలనఁ దెలియును. | 1 | 4 |
| ౯. తీర్థశ్రాద్ధవిధి. మహాలయప్రకరణము. డిటో. | 0 | 12 |
| ౧౦. పై రెండు కలిపి కలికోబయిండు. | 2 | 4 |

శ్రీః

స్వధర్మే నిధనం శ్రేయః.

శ్రీ చిదానన్ద సరస్వతీ శ్శరణం భవతు.

# మతదర్పణము.

బ్రహ్మశ్రీ పెమ్మరాజు సీతారామయ్య దీక్షితులవారిచేత

రచియింపఁబడినది.



స్వధర్మప్రకాశినీ పత్రికాధిపతులచేత ప్రకటింపఁబడినది.

బృందావనము కీలుపాకు. మదరాసు.

౧౯౨౯ ప్రతులు ౫౦౦

శుక్ల. సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి.

శ్రీరస్తు.

ఓం నమః పరమగురుభ్యః.

# మతము.

"మన్" అనుధాతువునకు ధ్యానించుట యని యొకయర్థము కలదు. ఆధాతువునకు భూతార్థకవిశేషణము "మత" యనిగలదు. దీని విశేష్యమే మత మగుచున్నది. కావున మత మనఁగా ధ్యాన మని తేట పడుచున్నది. ఇదిగాక "మన్" అనుక్రియలోనుండి మనన మనునామ వాచకమేర్పడుచున్నది. అట్టిమననేచ్ఛయే మీమాంస యనఁబడు చున్నది. మీమాంసయనఁగా విమర్శన; అట్టివిమర్శనవలన స్థిరపడు పర్య వసానమే మతమనఁబడును. విమర్శన యనఁగా కార్యకారణ పరిశోధన.

ఉదాహరణ:—ఒకవస్తువును జూచి యది యెట్లుపుట్టెనో యెట్లు పెరుఁగుచున్నదో యెట్లు గిట్టునో తదనంతర మది యెట్లుగా మారునో దానియవస్థ లన్నిటికిఁ గారణ మెద్దియో ఆకారణమునకుఁ బ్రయోజన మెద్దియో యావస్తువునకును గారణమునకును సంబంధమెద్దియో యోజించుటయే విమర్శన. అట్లు యోజనఁజేసిన మీఁదట మనము పడునభిప్రాయమే మతము. లోకములోనున్న యనంతవస్తుజాలములో దేనిని గుఱించి యిట్టివిమర్శనఁ జేసినను దానిపర్యవసానము మత మనవచ్చునా యని మీరు శంకింపవచ్చును. మతశబ్దార్థములలో నొకపక్షమం దట్లన వచ్చును. కాని మతశబ్దము రూఢిచేత సృష్టి, స్థితి, లయ, రూపకమును, పంచభూతాత్మకము నగు జగత్తునకుఁ గారణమును గుఱించి పైసఁజెప్పఁ బడిన రీతిని జేయంబడు విమర్శనాపర్యవసానమునకే వర్తించుచున్నది కాఁబట్టి మనకు ఆత్మవస్తు విట్టిదని తెలుపు పరమసిద్ధాంతమే సర్వమత సమ్మతమగు మతమని స్పష్టమగుచున్నది.

లోకములో కొంగ "నత్తలు లేని చెఱవు చెరువా" యని నత్త లనే యుత్కృష్టవస్తువులనుగా నెంచుచున్నది. హంస క్షీరమునే యుత్తమముగాఁ గొనుచున్నది. ఘాతుకమృగము హింసయే యుత్తమ

ధర్మమని యనుకొనుచున్నది. మనుష్యులలోఁ గొందఱు కామాది సుఖానుభవమే పరమపదముగా నెంచుచున్నారు ఇట్టివానిని మాత్రము మతములని యేల యనుకొనరాదని యనినచో నవి యన్నియు క్షణ భంగురవిషయము లనియు నజ్ఞానజనకము లనియు నిరసింపఁబడు చున్నవి మనుష్యులలో నందఱకుఁ గలుగు తలంపును విశ్వసింపక కొందఱి యభిప్రాయములకే మతము లని రూఢిచేసి గౌరవింపనేల? యని సంశయము కలుగవచ్చును. అది సరికాదు ఎట్లన?

"శ్లో॥ ఆహారనిద్రాభయమైథునాని సామాన్య మేతత్ పశుభి
ర్నరాణామ్, జ్ఞానంహి తేషాంస విశేషమాహుః
జ్ఞానేనహీనాః పశుభిస్సమానాః-"

అను నీతిశాస్త్రానుసారముగాఁ బశువులకన్న నరులకు జ్ఞానమూల మున విశేషత కలిగినది. మనుజులలోఁగూడ నాత్మనిష్ఠమగు జ్ఞానమును బ్రకాశింపఁజేయని పశుధర్మపరులగు వారికిమాత్ర మిది వర్తించదు. సామాన్యముగా తిర్యగ్జడములకంటె మానవులకు జ్ఞాన మెక్కువగా కలదు. జ్ఞాన మనఁగా వివేచనాశక్తి దానిమూలముగా మనుష్యులకే జగత్కారణవిచారణయు నాత్మవస్తునిర్ణయమును చేయుటకు సావకాశము కలుగుచున్నది. అట్టియాత్మ నిశ్చయమునకే మతమని పైనఁ జెప్పఁబడి నది. అట్టినిశ్చయము నరులలో మందమధ్యమోత్తమ తారతమ్యములను బట్టి బహువిధములుగా నేర్పడి పూర్వపక్ష, సిద్ధాంత, పరమసిద్ధాంత, మతములని మూఁడుతరగతులుగాఁ బరిణమించినది.

ఈ మతభేదములను బేర్కొని వానివాని పూర్వపక్ష, సిద్ధాంత ములను జేయకముందు మతవిచారణ యొక్కయావశ్యకమును గుఱించి యోజించుట యత్యావశ్యకముగనుక దానింగూర్చి తొలుదొల్త విచా రింతము-

మత మనఁగా నాత్మనిశ్చయముఁ జేయుట అనఁగాఁ దా నెవ్వరో యెక్కడనుండి యెక్కడికి వచ్చెనో, యెక్కడి కేఁగునో యెందులకు వచ్చెనో దృశ్య ప్రపంచమునకును దనకును సంబంధ మెట్టిదో యోజించి స్థిరపఱచుట. అది ప్రతివానికిని స్వభావసిద్ధము, ఎట్లనిన:—

(1) మన మొక్క సముద్రమధ్యద్వీపమునకు హఠాత్తుగఁ బోయి యక్కడ నిర్మనుష్య మగుచోట నొక రమ్యహర్మ్యమును గాంచినచో నిది యెవ్వరు కట్టిరో కదా యనుకొనుట సర్వసామాన్యధర్మము. అటులనే జగత్తును జూచి దానికి కారణ మొక్కటి యుండవలయుననుకొనుటయు, నది యేదియో తెలిసికొనఁగోరుటయు స్వభావసిద్ధము లేకదా! ఇందువలన మనుష్యమాత్రు లందఱకును నీశ్వరవిచారణ సహజధర్మము (Natural duty) గు నున్నది. ఇంతియ కాదు, అది మనకు నీతివిహిత ధర్మము (Moral duty) కూడ నగును ఎట్లన:—

(2) మన కొకగృహముఁ గట్టినవానిఁగాని, రోగనివారణ చేసిన వానిఁగాని, మరియేవిధముగా మేలు చేసినవానినిఁగాని మఱువకుండుట విధిగదా! అటులనే మనకు పునరావృత్తిరహితమయిన స్థితిని గలిగించు జ్ఞానమును ప్రసాదించిన యీశ్వరుని మఱువకుండుట మఱియంత యెక్కువవిధి గదా! ఈశ్వరుని మఱువకుండుట సదా తత్కథాశ్రవణ (Hearing) మనన (Thinking) నిదిధ్యాన (Mertation) లచేతఁగాని కలుగదు కనుకనే మతవిచారణ మన కావశ్యకము

(3) ఇదియునుంగాక "ఇంట గెలిచి రచ్చ గెలువు" మనునటుల ప్రతిమనుజుండును తనలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను శత్రువులను గెల్చిన తరువాతఁగాని లోకములో నున్న పై శత్రువుల జయింపనేరఁడు. అట్టి యంతశ్శత్రువిజయము మతవిచారణవలనఁగాక మఱియొకవిధమునఁ గలుగనేరదు. కావున మతవిచారణ యావశ్యకము.

(4) మఱియుఁ, బ్రతిమనుజునకును తనకంటె నెక్కువప్రియమైన వస్తువు తనకు మఱియొక్కటి యుండదు కావున తన్నును (ఆత్మను) తాను (జీవుఁడు) తెలిసికొనుటయందు ప్రతిమనుజునకును విధిగా నెక్కువకుతూహల ముండకతీరదు. తన్నును తాను తెలిసికొనుట యనఁగా జీవునకును (Undividul Soul) పరమాత్మ (Universal Soul) కుఁగల పరస్పర సంబంధ నిరూపణఁ జేయుట. అదియే మతసిద్ధాంతము.

(5) ఇదిగాక మనకు మనలను బరిపాలించు ప్రభువు కొంతధన మిచ్చినప్పు డది మనము సద్వినియోగముఁ జేయుచు బుద్ధిసూక్ష్మతచే

వృద్ధి నొందించితిమేని యా ప్రభువు మనపై నమితదయాపరుఁడై యఖండైశ్వర్యమును సుఖమును నిచ్చురీతిని సర్వపాలకుఁడైన పరాత్పరుఁడు మనలో నాటిన జ్ఞానాంకురమును బుద్ధిసూక్ష్మతచేత వృద్ధిఁ జేసితిమేని మనకును బరాత్పరుని కటాక్షముచే పునరావృత్తిరహిత శాశ్వతసుఖావాప్తి కలుగును ఈకారణముచేతఁ గూడ మతవిచారణ మనుజుల కత్యంతావశ్యకమును విధియు నగుచున్నది. మతవిచారణ కర్తవ్యమని కొన్ని యుక్తులను చెప్పితిమి. ఇఁకను పూర్వోక్త మతభేదవిచారణఁ జేయందగును ఇందులకు యుక్తులుగాక ప్రమాణమేమైనఁ గలదా యనుచో వేదప్రమాణ మొప్పువారికి ఆత్మవిచారణ యావశ్యకమనుటకు:—

"శ్రు॥ ఆత్మా వాఅరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"

అను మున్నగు శ్రుతి ప్రమాణములను "మననాన్మునిః" అను వాక్యమును జూపుచున్నాము విచారించఁగఁ బ్రకృతియుఁ బురుషుని కంటె నుఱియొకటిగా గోచరించుట లేదు ప్రకృతియనఁగా పంచభూతాత్మక మగు జగత్తు. పురుషుఁడనఁగాఁ దదంతర్యామి యగు పరమాత్మ. ఈ రెంటికంటె నన్యము లేదు. ఈ రెండును తేజస్తిమిరములవలె పరస్పర విరుద్ధధర్మము కలవి. ఎట్లన:—

| ప్రకృతి. | పురుషుఁడు |
|---|---|
| జడము (కదలలేనిది) | చైతన్యస్వరూపము (కదలఁగలది) |
| వికారయుక్తము (నశ్యము) | వికారరహితము (నిత్యము) |
| ఇంద్రియగోచరము | ఇంద్రియాతీతము |
| సగుణము | నిర్గుణము |
| ఆదిమధ్యాంతయుక్తము | ఆదిమధ్యాంతశూన్యము |
| నామరూపక్రియాదికసహితము | నామరూపక్రియాదిశూన్యము. |

ఇట్టి విరుద్ధధర్మము లనేకములు గలవు ఇట్టి చైతన్య తత్త్వవిచారణలోఁ బండితులే భిన్నభిన్నాప్రాయులైరి ఇఁక పామరులమాట చెప్పనేల? మనము పుచ్చుకొను అన్నమువలన నింద్రియములకుఁ బుష్టి గలుగుటచే నన్నమే చైతన్యమని కొందఱు తలఁచిరి కాని అన్నము ఓషధిజన్యము ఓషధులు పృథివీమయములు పృథివ్యాదులు జడములు జడము స్వతంత్రలకు శక్తిలేదు. కనుక అన్నము చైతన్యము కానేరదు. కొందఱు

దేహములందు ప్రవహించు అప్పుస్వరూపమగు రక్తమే చైతన్యమని యెంచిరి కాని అది సరికాదు. రక్తము అన్నమువలనఁ గలుగుచున్నది. కనుక నన్నముతో సజాతీయధర్మము కలది యగును. అన్నము జడమనియుఁ గనుకనే స్వతంత్రశక్తి లేదనియుఁ బైనఁ జెప్పఁబడినది గనుక ఆ కారణముచే రక్తముకూడ చైతన్యము కానేరదు మఱియుఁ గొందఱు చైతన్యము తేజోరూపముగల దేహములందుండు జఠరాగ్ని యని సమర్థించిరి. అదియు సరికాదు. ప్రాణవాయు వాధారము లేక యగ్ని ప్రజ్వలింపనేరదు. అగ్ని జడము కనుక స్వతంత్రశక్తిలేదు. కాన నిది చైతన్యముకాదు. చైతన్యము వాయురూపమని కొందఱూహించిరికాని యదియు సరికాదు. ఏమన? వాయు వింద్రియగోచరము. చైతన్యమింద్రియాతీతము. వాయువు స్పర్శగుణము కలది చైతన్యము నిర్గుణము. వాయువు జడము స్వతంత్ర శక్తిలేనిది. కావున వాయువు చైతన్యము కానేరదు. చైతన్య మాకాశ స్వరూపమని కొందఱి యభిమతము. అది సరికాదు. ఆకాశము శబ్దగుణప్రధానము. చైతన్యము శబ్దాతీతము. ఆకాశము జడము గనుక స్వశక్తిశూన్యము. అందుచేతనే యది చైతన్యము కానేరదు. ఈప్రకారము పంచభూతాత్మక మయిన సృష్టిలో నేదియుఁ జైతన్యము కానందున చైతన్యము సృష్టికిఁ బూర్వముండునదియు, సృష్టితో రానిదియు, సృష్టితో పోనిదియు, సృష్టికంటె విజాతీయమైనదియు, నిత్యమగునదియు నిర్వికారమును, నాశరహితము నగునొకసత్తా (Force) కావలసివచ్చినది.

మఱియు సర్వదా వ్యాపకత్వ సర్వశక్తిత్వ పరిపూర్ణత్వాది విశిష్ట గుణ సంపత్తిగల యాసత్తు (Prime ordeal universel force) పరమాత్మ యనఁదగును. ఆపరమాత్మకే బ్రహ్మమనిపేరు. ఈ పరిదృశ్యమానమైన జగత్తునకు సృష్టి స్థితి లయములు దేనినుండి కలిగెనో యదియే బ్రహ్మము. ఆ బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వములే జగత్కారణములు. ఈ విషయమయి పరమాత్మకును జగత్తునకును సంబంధ మున్నదా? లేదా? యనియు, ఉన్నచో నాసంబంధమెట్టి దనియును, పరమాత్మ కలదా యనియును, సృష్టి కలదా యనియు, నున్నచోఁ బరమాత్మకు సృష్టి చేయవలసిన పని యేమనియు, సృష్టికిఁ గారణ మేమనియు, ననేకాంశములు విచారించుటలో ననేకాభిప్రాయము లనేక మతరూపములుగా నేర్పడెను.

అవి నాస్తికమతములు, ప్రచ్ఛన్న నాస్తికమతములు, ఆస్తికమతములు నని మూఁడు తెఱంగులు. అందు మొదటి రెండును పూర్వపక్షమతములు. ఇందు మొదటిదానిలో సాంఖ్య, న్యాయ, వైశేషిక, జైన బౌద్ధమతములును; రెండవదానిలో చార్వాక, కాపాలిక, ఆర్హతమతములును, క్రైస్తవ మహమ్మదీయాది మతములు జీవోత్పత్తికి (Material couse) కారణము చెప్పలేకపోయినందున నీశ్వరుఁ డున్నాఁడని యొప్పినను ప్రచ్ఛన్న నాస్తికమతములలోనే చేరుచున్నవి. కడపటివానిలో ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతమతములును పరమసిద్ధాంతమతమును వేదాంతమతమును చేరుచున్నవి.



## రెండవప్రకరణము.

### పూర్వపక్ష మతవివరణము; తన్నిరాసము.

### REFUSED RELIGIOUS & THEIR DOCTRINES DISCUSSED.

బహువిధనామరూపములు గలిగినట్టియు, ననేక కర్తృ భోక్తృ సంయుక్తమైనట్టియు నచింత్య రచనోపేతమైనట్టియు విచిత్రజగన్నిర్మాణ సామర్థ్యము (Power of creation) సర్వజ్ఞత్వ (Omniscience) సర్వశక్తిత్వ (Omnipotence) లక్షణములు గల బ్రహ్మమునకే యుండవలెను గాని తదన్యమున కుండఁజాలదు. అచేతనమగు ప్రధానముగాని యణువులు గాని, స్వభావముగాని జీవుఁడేగాని యిట్టిసృష్టిని జేయనోపవని యీక్రింద సయుక్తికముగాఁ జూపుచున్నారము.

పూర్వపక్షమతములన్నిటిలోను సాంఖ్యమతము యుక్తిప్రమాణమగుటచేఁ దద్వివరణము దన్నిరాసమును, ముమ్ముందు చేయఁబడును. సాంఖ్యము సేశ్వరమనియు నిరీశ్వరమనియు రెండువిధములు. అందులో సేశ్వర సాంఖ్యులు జగత్తున కీశ్వరుఁడుపాదానకారణ (Chiefor Primary cause) మనియును ప్రధానము (Substance) నిమిత్తకారణ (Immediate cause) మనియుఁ జెప్పుచున్నారు. ఉదాహరణము కుండకు మన్ను ఉపాదానకారణము కుమ్మరివాఁడు నిమిత్తకారణము. అటులనే జగదీశ్వర విషయమనుచున్నారు. ఈసేశ్వరసాంఖ్యమునకే యోగమత మనియు,

హైరణ్య గర్భమత మనియు నామాంతరములు గలవు. నిరీశ్వరసాంఖ్యులు (Materialist) జగత్తునకు ప్రధానమే (Sub stance) యుపాదాన కారణమనియుఁ జెప్పుచున్నారు. సాంఖ్యమతమునకు కీలకమగు ప్రధాన మేమియని విచారింతము. సత్త్వరజస్తమోగుణముల సమతావస్థయే Adjustment of Satva Rajasa & Tamasa elements in Nature ప్రధానము. దానికి విషయము కలుగఁగానే జగత్సృష్టి యగుచున్నది. ఆ ప్రధానము మృత్తువలెనే యచేతన మయ్యును పురుషభోగార్థమై (to be enjoyed by the self) విచిత్ర ప్రపంచముగా పరిణమించుచున్నది. గాని దానికి కారణాంతరము లేదని నిరీశ్వరసాంఖ్యవాదము. వారివాదము ప్రకారముగానే యచేతనమగు ప్రధానమునకు స్వతంత్ర శక్తిలేదు గనుక జ్ఞానపూర్వకమగు నీ వివిధ విచిత్ర ప్రపంచరచనకు నిది కారణ మనుట యుక్తియుక్తము కాదు. మన్నుకుండగా చేయుటకుఁ గుమ్మరివాఁడు, కఱ్ఱ, సారె, మొదలగు సహాయము లున్నపుడే ఘటరచన కన్పట్టునట్లు ప్రధానమందును జేతనసహాయ (Active consciousness) మున్నప్పుడే ప్రపంచరచనాసామర్థ్యము కలుగుచున్నది గాని స్వతంత్రముగా నట్టి సామర్థ్యము లేదు. అచేతనమగు క్షీరము తన్నుఁ ద్రాగినవత్సయొక్క వివృద్ధికొఱ కెట్లు సహజముగానే ప్రవర్తించునో యటులనే త్రిగుణాత్మక మగు ప్రధానము పురుషప్రయోజనార్థము విషమావస్థను బొంది సహజముగానే ప్రవర్తించుచున్న దని సాంఖ్యులు వాదించఁగా గోవు తన దూడయందలి స్నేహముచేతను, అది వృద్ధికావలెనను నిచ్ఛచేతను, తనయందలి పాలను జారవిడుచుటచేతను దూడ పాల నాకర్షించుట చేతను పాలు స్రవింపుచున్న వని చెప్పెడి సాంఖ్యయుక్తి నిరసింపఁబడినది. మఱియుఁ బ్రధానము సహాయాంతరాపేక్ష (Need of exteral help) లేనిదగుటచే జగత్కారణము కాదు. ధేన్వాదులు భుజియించిన తృణాదికము స్వభావముగానే యెట్లు క్షీరాకారముగా పరిణమించుచున్నదో యటులనే త్రిగుణాత్మకమగు ప్రధానము మహత్తుగా పరిణమించుచున్న దని వాదించఁగా గోవులవలన భుజింపఁబడిన తృణాదులే కాలవయో విశేషములచేఁ బాలుగా పరిణమించుచున్నవిగాని యాతృణాదికమే వృషభాదులవలన భుజింపఁబడినచోఁ బాలగుటలేదు. కావున తృణాదికము పాలగుటకు గోవులే గారణములుగాని పరిణామశక్తియొక్క స్వభావము

మాత్రముగాదు. అయినచోఁ దృణమును, ఉదకము, నొకపాత్రలోఁ బోసిన నవి పాలు కావలసియుండును కాని యవి యట్లగుట లేదు. కావున వానికి నిమిత్తాంతరాపేక్ష కలదని యంగీకరించవలెను. ఇటులనే ప్రధానమునకు సహజపరిణామశక్తి (Imate Transformation) లేదు. నిమిత్తాంతరాపేక్ష యున్నది గనుక నది జగత్కారణము కానేరదు. ప్రధానము (Substance) నకు స్వాతంత్ర్యమున్నదని యొప్పినను ప్రయోజనా (Purpose) భావముచే నది నిరర్థక మగుచున్నది. ఒకవేళ నొక గ్రుడ్డివాని మూఁపున నెక్కిన కుంటివాఁడు ప్రవర్తించునట్లు స్వయముగా నప్రవర్తమానముగా నయస్కాంతము లోహమును ప్రవర్తింపఁజేయునట్లు పురుష ప్రేరణమున ప్రధానము ప్రవర్తించుచున్నదని సాంఖ్యులన్నచో నదియు సరికాదు. పూర్వపక్షి నరీశ్వర సాంఖ్యుఁడైనచో (Materialist) స్వమత సిద్ధాంతహాని కలుగుచున్నది. ప్రధానము స్వతంత్రశక్తి కలదగుటచే పురుషుఁ డుదాసీనుఁ డగును. (Tatastah or non-interfering passive agent) అందువల్ల పురుషుఁడు ప్రధానమును ప్రేరేపించుట యసంభవము. ప్రధాన మచేతన మగుటచేతను, పురుషుఁ డుదాసీనుఁ డగుటచేతను, తృతీయపదార్థసహాయము లేకపోవుటచేతను, సృష్టియగుటకే అవకాశము లేదు. అప్రవర్తకుఁడగు కుంటివానిమాటలచే గ్రుడ్డివాఁడు ప్రవర్తించునట్లు ఈశ్వరుని ప్రేరణచే నిష్క్రియుఁడును నిర్గుణుఁడును నగు పురుషున కట్టివ్యాపార మసంగతము.

ఇదిగాక సాంఖ్యమతమందు నింద్రియము లేదని కొందఱును, మూఁడని కొందఱును, మహత్తత్వమునుండి సృష్టి యని కొందఱును, అహంకారమునుండి సృష్టియని కొందఱును, పరస్పర విరోధ వాదములు గూడఁ జేయుచుండుటచేత వారిమత మయుక్త మగుచున్నది.

## న్యాయవైశేషిక మతముల వివరణము.

ఇవి పరమాణువులు జగత్కారణములని (Atomic Theory) వాదించుచున్నవి. పరమాణువులు జడము లగుటచే వానినిఁ గూర్ప మఱియొకటి (combining Agent) అటులనే వాని నెడఁబాపునది కూడ మఱియొకటి (Separating Agent) కావలసి యుండెను. అనఁగా సృష్టి (Creation) ప్రళయమునకు (Destruction) అచేతనములగు

పరమాణువులకన్న భిన్నమగు శక్తియొకటి (Force) యపేక్షణీయము గనుకను, పరమాణువులకు స్వతంత్ర శక్తి లేదు కనుకను పరమాణువులు జగత్కారణము కానేరవు. ఇదిగాక సాంఖ్య, న్యాయ, వైశేషిక మతములు దుర్యుక్తియోగము (Bad reasoning) వలనను, వేదవిరోధము వలనను, శిష్టాపరిగ్రహమువలనను (Non-acceptence by Experts) అనపేక్షితములని బోధింపఁబడినవి. ఇందుకు వైశేషికులు పృథివ్యప్తేజోవాయుపరమాణువులును, ఆకాశదిక్కాలును, ఆత్మ మనస్సులును నిత్యము లనియుఁ, దదితరము లన్నియు ననిత్యము లనుటచే నర్ధవైనాశికు (Partial atheists) లనఁబడుచున్నారు. ఇవి యన్నియు ననిత్యము లనుటచేఁ బూర్ణ వైనాశికులు (Complete atheists) బౌద్ధులగుచున్నారు. బౌద్ధులు నాలుగువిధములు, ౧. సౌత్రాంతికులు, ౨. వైభాషికులు, 3. యోగాచారులు, ౪. మాధ్యమికులు. ఇందులో, ౧, ౨, అనఁగా బాహ్యార్థవాదులు అస్తిత్వవాదులే (Those that admit the-Realitylof the world) మూఁడవ వారు విజ్ఞానాస్తిత్వవాదులు (Those that admit the Existence of working intelligence and deny that of the Real world) అనఁగా బాహ్యశూన్యవాదులు. నాలవవారు సర్వశూన్యవాదులు (Nilhists) బాహ్యవాదులనఁగాఁ బృథివ్యాది స్థూలద్రవ్యమనుమేయము (Inferential) అనుచు మొదటివారును, అది ప్రత్యక్షము (Real) అని రెండవవారును అనుచున్నారు. ఈబౌద్ధుల వాదమందును వస్తువులకు "క్షణికోత్పత్తి" (Momentary Birth) క్షణికవినాశములు (Momentary Death) ముఖ్యాంశములు. వస్తువులు క్షణికములను వాదమున పరస్పరకారణత్వము (Law of Cansation) సిద్ధింపఁజాలదు. ఏలయనఁగా కారణముగా నంగీకరింపఁబడు నొకవస్తువునకు సిద్ధి యగుటకై దానికి స్వోత్పత్తి (Objective Existence) సమయమును పరనిష్పన్నసమయమును (Chemical Combination) వస్త్వోత్పాదక సమయమును (Formation of another Substance) ఉండవలెను. స్వోత్పత్తికాలమందే కార్యోత్పాదనము చేయుచున్న దనిన యెడల కార్యకారణవిభాగమే లేకపోవును. ఉత్పత్తి వినాశములు సకలవస్తువులకు (Matter) స్వరూపములని (Natural) కాని, యవస్థాంతరములని కాని, (Transformation) వస్త్వంతరము లని కాని యోచించినచో నీ క్రింది

దోషము కలుగుచున్నది. స్వరూపములన్నచో నుత్పత్తి వినాశశబ్దములు వస్తుశబ్దమునకు పర్యాయములే కావలెను. అట్లయి యుండలేదు. అవస్థలన్నచో వస్తువునకు నాద్యంత మధ్యమస్థితులు గల్గి వస్తువు క్షణికమగుచున్నది. వస్త్వంతరము లనినచో దానికి వస్తుసంబంధము లేకపోవుటచేత శాశ్వత మని చెప్పవలసి వచ్చును. ఇందువలన బౌద్ధుల క్షణికత్వ వాదమునకు భంగము కలుగుచున్నది. పదార్థజాలము క్షణిక మని చెప్పినట్లుగానే జ్ఞాతయును (Knower or Seer) పదార్థవిషయక జ్ఞానమును (Knowledge of things) క్షణికము లనవలెను. అయినచో మనకు నిన్న చూచినవస్తువు నేఁడు స్మరణమునకు రాఁగూడదు. అట్టి స్మృతి సర్వానుభవ సిద్ధము. వాస్తవముగా బాహ్యపదార్థములు లేవనియు, ఉన్నట్లు కనఁబడు ననియు బౌద్ధులలో విజ్ఞానవాదులు చెప్పుచున్నారు. బాహ్యపదార్థస్ఫూర్తి (Realisation) స్వానుభవవేద్య మగుటచే లేదనుట యసంగతము. ఒకఁ డన్నమును భుజించి తృప్తిపొందిన పిమ్మట "తాను భుజింపలేదు. తృప్తిపొందలేదు" అనుట యెట్లు లసంగతమో యటులనే యింద్రియసంబంధములచే బాహ్యపదార్థములను దెలిసికొనుచు నవి లేవనఁగూడదు. సర్వశూన్యవాదమును జేయుమాధ్యమిక బౌద్ధవాదము శాస్త్రానుభవ విరుద్ధ మగుటచే నసంగతము.

## జైనమతవివరణము.

ఈ జైనులు దిగంబరులనియు (అనఁగా రంగుబట్టలు కట్టువారు) శ్వేతాంబరు లనియు ద్వివిధము. వీరిమతములో పదార్థములు "జీవము" లనియు నవాంతరభాగము లనేకములుగలవు. వీరఖండ నిర్వికారచైతన్య మగు బ్రహ్మ మేకరూప మను వేదాంతమునకు విరోధముగా ననేకాంతవాదము చేయుచున్నారు. (The world is Made of Manifold Forms) ఏకపదార్థమందు "సత్యాసత్య విరుద్ధధర్మసమావేశ" (Combination of Power & Non-Power) మేకకాలమందు శీతోష్ణమువలె సంభవింపఁజాలదు. కావున నీయార్హతమత మసంగతము. ఈమతమందు మఱియొక దోషము కలదు. ఏమనఁగా:—జీవుఁడు దేహానురూప ప్రమాణము (Size Proportionate to Bodies) కలవాఁడనియు, నిత్యుఁడనియుఁ, గర్మ

విపాకముచే గజమనుష్యాది భిన్నభిన్న జన్మములు కలుగవచ్చుననియు, జైనులు తలంచుచున్నారు. అట్లైనచో నొకమనుష్యజీవుండు మనుష్యపరిమాణమును బొంది మరల నెద్దియైన, కర్మవిపాకము (Change of act) చే "హస్తి" జన్మమును బొందెనేని దన తొల్లింటి పరిమాణ మల్పమగుటచే గజశరీరము నంతయు వ్యాపింపఁ జాలకున్నాఁడు. కావున నిర్జీవి కావలసివచ్చును. మఱియు వానికి దోమజన్మము కలిగెనేని వానియందలి కొంతభాగము దోమశరీరములో దూఱక బైటనుండుటచే మరల పూర్వోక్తదోషమే కలుగును. ఏకజన్మమందుఁగూడ శరీరమునకుఁ గౌమార యౌవనాద్యవస్థ లందుస్థౌల్య సౌక్ష్మ్యములు కలిగినప్పుడు పైదోషములే కలుగుచున్నవి. కనుక వీరిమత మసంగతము.

## పాశుపతమతము.

దీనినే మహేశ్వరమత మని యందురు. పశుపతి యగు నీశ్వరుఁడు జగత్తునకు కేవల నిమిత్తకారణమే యనియుఁ, బశుపాశ మోక్షార్థ మనఁగా జీవబంధవినాశము (Redemption of Jiva) కొఱకు కార్య, కారణ, యోగ, దుఃఖాంతము లని పదార్థము లేనువిధములుగా విభజింపఁబడె ననియు, మాహేశ్వరులు భావింపుచున్నారు. కార్య మనఁగా మహదాదికము (Effect) కారణ మనఁగా నీశ్వరుఁడును బ్రధానమును. (cause real & apparent) యోగ మనఁగా సమాధి. విధి యనఁగా త్రికాల స్నానాద్యాచారములు. దుఃఖాంతమనఁగా మోక్షము. ఈమహేశ్వరు లాచారభేదముచే శైవులును, పాశుపతులును, కారుణిక సిద్ధాంతులును, కాపాలికులును, అని నాలుగు తెఱఁగులుగా నున్నారు. వీరికిఁ బాశుపతాగమము ముఖ్యప్రమాణము. వీరివలెనే యాగమప్రమాణము నంగీకరించు నేశ్వరసాంఖ్యులును, యోగులును గూడ నీశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణము మాత్రమే యనియును, ప్రధాన ముపాదాన కారణమనియును ప్రధాన పురుషేశ్వరులు (Substance Self & Sprit) పరస్పర విలక్షణము లనియు (Distinct) తలంచుచున్నారు. ఇటులనే యనుమాన ప్రమాణమాత్రముచే (inference) నీశ్వరసద్భావము (Existence) ను సాధించునట్టి తార్కిక వైశేషికులు

(Materialists) ను స్వప్రక్రియానుసారముగా (in accordance with their theory) ఈశ్వరుఁడు నిమిత్తకారణ మని చెప్పుచున్నారు.

⟵ ఈమతములన్నియు దూష్యములని చెప్పుటకు కారణములు. ⟶

సామరస్యము (Unity) లేకపోవుటవలన ఈశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణము మాత్రమేయని చెప్పఁగూడదు. సామరస్య మున్న యెడల జగత్తునకుఁ గల వైషమ్య నైర్ఘృణ్యదోషమును, కర్తేశ్వరుల కన్యోన్యాశ్రయదోషమును ఉదాసీనుఁడనుటచే సృష్టికర్తృత్వదోషమును సిద్ధించును. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు ననంతుఁడు (Infinity) ననియు, ప్రధానము (Substance) గూడ ననంత మనియుఁ బురుషులు ననంతులే యనియు నీమూఁడును బరస్పరభిన్నము లనియును నీమతస్థు లంగీకరించినారు. సర్వజ్ఞుఁడగు నీశ్వరునిచేఁ దనయొక్కయు ప్రధానము యొక్కయు బురుషునియొక్కయుఁ బరిమాణ మింతింతయని చెప్పఁబడి యుండలేదు. అయినను దోషమే కలుగుచున్నది. ప్రధాన పురుషేశ్వరులు పరిమాణముచేఁ బరిచ్ఛిన్ను లంటిమా? ఘటాదికమునకువలె వినాశము సంభవించుచున్నది. లేదంటిమా? ఈశ్వరునకు సర్వజ్ఞత్వ హాని కలుగుచున్నది. తార్కికులవాద మసమంజసము.

భాగవతమతము.

ఈ మతమునకు పాంచరాత్రాగమము ప్రమాణము. ఆయాగమము వాసుదేవప్రణీత మనియు వేదతుల్య మనియు వారు చెప్పుచున్నారు. ఈమతమున భగవంతుఁ డొక్కఁడే. అతఁడు నిరంజనుఁడును, జ్ఞానస్వరూపుఁడును నగు వాసుదేవుఁడు. అతఁడే పరమార్థతత్త్వము. అతఁడు తన్నును తానే నాలుగుభాగములు గాచేసికొనెను. ఎట్లనఁగా—

(౧) వాసుదేవవ్యూహము=పరమాత్మ (Universal Soul)

(౨) సంకర్షణవ్యూహము=జీవుఁడు (Individual soul)

(౩) ప్రద్యుమ్నవ్యూహము=మనస్సు (mind)

(౪) అనిరుద్ధవ్యూహము=అహంకారము (me and mine)

వీరిలో వాసుదేవుఁడు పరాప్రకృతి అనఁగా మూలకారణము. (Absolute cause) ఇతరులు తత్కార్యములు. వ్యూహ మనఁగా మూర్తి. (Body) ఈనారాయణుఁడే అవ్యక్తముకంటెఁ బరుఁడగు పరమాత్మ, సర్వాత్మ, అతఁడే తన్ననేకవిధములుగా మూర్తీభవింపఁజేసికొనియున్నాఁడు. "సఏకధా భవతి, త్రిధా భవతి" అను శ్రుతిసమ్మతమగుటచేతఁ దన్నుఁ దానే యనేకవిధములుగాఁ జేసికొన్నాఁడనుట నిరాకరింపఁబడుట లేదు. ఇఁక వాసుదేవునివలన సంకర్షణుఁడును, సంకర్షణునివలనఁ బ్రద్యుమ్నుఁడును, ప్రద్యుమ్నునివలన ననిరుద్ధుఁడును బుట్టుచున్నారను పాంచరాత్రాగమసిద్ధాంతము "ఉత్పత్త్యసంభవాత్" త్తను సూత్రముచే వేదవిరుద్ధ మని దూషింపఁబడుచున్నది. జీవుఁడుత్పన్నపదార్థమే యైనచో వాని కనిత్యత్వము (Mortality) సిద్ధించును. అందువలన మోక్షప్రాప్తి (Redemption) కానేరదు. జీవుఁడుత్పత్తికానిచో మనస్సున కుత్పత్తి యసంభవము. మనస్సు లేనిచో నహంకార మున్భవించుటకు చోటే లేదు వాసుదేవాదులు విజ్ఞానశక్తులు సమాను లనిన (ఉత్పత్తి లేకపోవుట) యను దోషము కలుగును. వాసుదేవాదులు పరస్పరభిన్నులును (District) స్వతంత్రులును తుల్యధర్ములును (Independent and equal) నైనచో ననేకేశ్వర కల్పన చేసినట్టగును. ఒక్క యీశ్వరునిచే సృష్టి సిద్ధించుచుండఁగా ననేకేశ్వరు లున్నారనుటవలనఁ బ్రయోజనము లేదు. నలుగురు సమావేశము కావలెనని నయెడల నందు నెవ్వరికిని నీశ్వరత్వము లేకపోవును. కావున బ్రహ్మాదిస్తంబపర్యంతము నగు సమస్తజగత్తును భగవద్వ్యూహామేయని చెప్పఁదగియున్నది కాన సంఖ్యానియమమున కవకాశము లేదు. పరస్పర విరోధము లుండుటచే జీవోత్పత్తివాద మసంగతము. పరమార్థతత్త్వమగు వాసుదేవుఁడు గుణియనియు, సంకర్షణాదులు గుణములనియు నొకచోటను; వీరందఱును జ్ఞానైశ్వర్య శక్తి బల తేజో గుణములచే సమాను లని మఱియొకచోటను బోధింపఁబడినది. ప్రద్యుమ్నానిరుద్ధాదు లాత్మకంటె భిన్నులని యొకచోటను, ఆత్మలే యని యొకచోటను జెప్పబడినది. చతుర్వేదాధ్యయనమున మోక్షప్రాప్తి లేదని యెంచి శాండిల్యముని యీ పాంచరాత్రాగమమును జేసె నను

టచే వేదనిందాదోషము కలుగుచున్నది. ఈపరస్పర భేదమువలన నీ పాంచరాత్రాగమ కల్పన యసంగత మని సిద్ధమగుచున్నది.

ఇట్లు జగత్కారణ విషయమున కలిగిన పూర్వపక్షమతముల వివరణము చేయఁబడినది. ఇందులో కేవల మీశ్వరాభావమును జెప్పునవి కేవలనాస్తికమతములు. ఈశ్వరుని యాస్తికత్వమున నొప్పుకొని యాతనిఁ గేవల నిమిత్తమాత్రుఁ డనువారు ప్రచ్ఛన్ననాస్తికులు. మిగిలినవి సిద్ధాంతమతములు. అవి "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యని యీష ద్భేదములతో నంగీకరించుచున్నవి. ఇందు జీవేశ్వర సంబంధ విషయ లలో కించిద్భేదము లున్నను నవి శ్రుతిసమ్మతములును, యథార్థవస్తు బోధకములును నగుటచే సిద్ధాంతములుగా నుత్తర మీమాంసకులచే నంగీకరింపఁబడినవి. "సర్వం ఖల్విదం బ్రహ్మ, నాన్య దస్తి కించన" అను పరమసిద్ధాంతమతముగూడ నుపాసనాసాధ్యమును, అనుభవైక వేద్యమును గావున నందఱిచే నంగీకరింపఁబడి యున్నది. ఈ సిద్ధాంతమత పరమ సిద్ధాంతమత వివరణము మూఁడవప్రకరణమునఁ జేయఁబడును.



## మూఁడవ ప్రకరణము.

### సిద్ధాంత మతవివరణము.

ఇదివఱకు మొదటిప్రకరణములో మతశబ్దార్థనిర్వచనమును, మతముయొక్క యావశ్యకమును గుఱించియు వ్రాయఁబడినది. రెండవప్రకరణములోఁ బూర్వపక్షమతనిరాకరణము సంగ్రహముగఁ జేయఁబడినది. ఇఁకను సిద్ధాంతమతవివరణము చేయఁబడును. ఇప్పటివారిలో మతవిషయక జ్ఞానమం దభిరుచికలవారు తక్కువ గనుకను మతవిషయకోపన్యాసములు సులభముగా నవగాహన మగునవి కావుగనుకను పూర్వోక్త ప్రకరణములలోని, యంశములనే తొలుదొల్త చదువరులకు జ్ఞాపకార్థమై సంగ్రహముగ వ్రాసి పిదప ప్రస్తుతాంశమును వివరించెదను.

మతములు పూర్వపక్ష మతములనియు, సిద్ధాంత మతములనియు రెండువిధములు. మొదటివి కేవల నాస్తిక మతములనియుఁ, బ్రచ్ఛన్న నాస్తికమతములనియు రెండువిధములు. అట్లే సిద్ధాంతమతములలోఁగూడ

ఆస్తిక మతములనియు, శుద్ధాస్తికమతములనియు రెండువిధములు గలవు. ఈ నాలుగువిధములగు మతములలోను గడపటిదియగు శుద్ధాస్తికమతము మాత్రము ఏకమతమై యున్నది. దీనికే పరమ సిద్ధాంతమతమనియు, వేదాంత మతమనియు, బ్రహ్మ మతమనియు, అద్వైత మతమనియు, నామాంతరములు గలవు. ఆ యద్వైత మతమునుగుఱించి ముందు సవిస్తరముగా వ్రాయఁబడును. తక్కిన మూఁడు విధములగు మతముల లోను ననేక భేదములుగలవు. అందు ముఖ్యమైనవానిని వివరించెద:—

## పూర్వపక్షమతములు.

1. బౌద్ధమతములు మూఁడు:—

| | |
|---|---|
| (౧) జ్ఞానము, వస్తువుకూడ కలదనువారు | వీరు క్షణికోత్పత్తి క్షణిక వినాశనము కలదని చెప్పుదురు. |
| (౨) జ్ఞానము, మాత్రమే కలదనువారు | |
| (3) జ్ఞాన, వస్తువులు రెండును లేవనువారు | |

2. చార్వాకమతములు ఆఱు:—

(౫) పంచభూతమతములలోను ఒక్కొక్కటి నిత్యమని చెప్పునతము.

(౧) పంచభూతసమావేశమే జగత్కారణ మనుమతము.

ఇత్యాదిమతములు కేవల నాస్తికమతములు.

3. యోగసాంఖ్యమతములు:—

ఇవి ప్రధాన మనఁగా మాయ జగత్కారణమని చెప్పునవి. ఇందు పతంజలికృతము ఆస్తికసాంఖ్యము (లేక) సేశ్వరసాంఖ్యము. 2 కపిలకృతము నాస్తిక (లేక) నిరీశ్వరసాంఖ్యము.

4. శైవ శాక్తేయమతములు. ఇవి చిచ్ఛక్తి జగత్కారణ మనునవి.

5. తార్కికమతము. పరమాణువులు జగత్కారణమను వారిమతములు. ఇందు 1 నైయాయికమతము. ఇది గౌతముని సిద్ధాంతము. ఇది ఆస్తిక తర్కము. 2 వైశేషికమతము. ఇది కణాదసిద్ధాంతము. ఇది నాస్తిక తర్కము.

6. ఆర్హతమతము. ఇది జైనులసిద్ధాంతము. ఇది ప్రపంచపదార్థము జగత్కారణ మని వాదించునది.

7. పూర్వ మీమాంసామతము. ఇది కర్మము జగత్కారణ మనునది.
ఇవి ప్రచ్ఛన్న నాస్తికమతములు.

8. ద్వైతము
9. విశిష్టాద్వైతము } ఇవి జీవేశ్వరులు జగత్కారణములని చెప్పు మతములు. ఇవి ఆస్తికమతములు.

10. అద్వైతము:—బ్రహ్మమొక్కఁడే సత్యమనియు, రెండవది లేదనియు నిశ్చయించినమతము. ఇదే శుద్ధాస్తికమతము. ఇదే పరమసిద్ధాంతము.

ఇటుల సర్వమతములును పదిభాగములుగా విభజింపఁబడియున్నవి. ఇందు మొదటి యేడును పూర్వపక్షమతములును, కడపటి మూఁడును సిద్ధాంతమతములునునై యున్నవి.

## పూర్వపక్షమతములసారము.

1 శూన్యవాదము. 2 పంచభూతకారణవాదము. 3 పరమాణుకారణవాదము. 4 ప్రధాన (మాయా) కారణవాదము. 5 కర్మకారణవాదము. అని అయిదుభాగములుగా నున్నది. ఈయయిదింటి తాత్పర్యము "అచేతనపదార్థమే" జగత్కారణ మని స్పష్టమగుచున్నది. అట్టి అచేతమునకుఁ గలరూపభేదముల నిర్ణయించుటలో నిన్నిమతభేదములు గలిగెఁగాని వాస్తవముగా నివియన్నియు నొకేమతమయి యున్నవి. ఇన్ని పూర్వపక్షమతము లుండుటకుఁ గారణము, సిద్ధాంతమును మఱింత స్థిరపఱుచుట కేయని యిదివఱకు ప్రకరణములలో వ్రాయఁబడినది.

## సిద్ధాంతమతవివరణము.

సిద్ధాంతమతములలో ఆస్తికమతమని శుద్ధాస్తికమతమని రెండు తరగతులు గలవు. ఆస్తికమతములలో శైవవైష్ణవాదికమతము లనేకము లున్నను జీవేశ్వరులు సచేతనులై నిత్యులై యున్నారనుటకు భగవంతుఁడొక్కఁడేయనుటకును భిన్నాభిప్రాయంబులు లేవు. కాని వీనిలో రెండు తెగలు గలవు.

## 1 ద్వైతము. 2 విశిష్టాద్వైతము.

ఈ రెండుమతములవారును నీశ్వరుఁడే జగత్కారణుఁ డనుట వలన నివి యాస్తికమతము లనఁబడెను. ఈ మతములలో జీవుఁడును పరమాత్మయును వేరువేరు పదార్థములని చెప్పునది ద్వైతము. ఇందు సర్వ

వాఁడగుటచే నట్టి తారతమ్యాజ్ఞాతాది భేదములకుఁ గారణమైనది. జీవులకు అండాండ పిండాండంబులును, ఈశ్వరునకు బ్రహ్మాండంబును స్థూల శరీరములయి యున్నవి. ప్రళయమం దాశరీరములు నశించినను జీవులు నశించువారుకారు. నిత్యులై యుందురు. ప్రళయకాలములో నీశ్వరుని యందు జీవు లిమిడియుందురు. సృష్టియందు స్థూలశరీరమును ధరించి జన్మాదుల నెత్తుచుందురు. ఇందులకు దృష్టాంతము, తాఁబేలు నిద్రయందు తనసర్వాంగములఁ దనలో నిమిడ్చికొని జాగ్రదవస్థయందు వానిని పైకి చాచునట్లే ఈశ్వరునియందు జీవులకు సంకోచములు గలుగుచుండును. ఈజీవులు తృణ జలూకాన్యాయముగా ననఁగా గడ్డిమీఁదనుండు జెలగ యేలాగున తన ముందటి గడ్డిపరకనుపట్టుకొని తానున్న గడ్డిపరకను వదలి వేయునో ఆలాగుననే జీవులునయితము ముందటి శరీరమును గ్రహించి వెనుకటి శరీరములను విడిచిపెట్టుదురు. దీనికే జన్మించుట యనిపేరు. ఇట్టి శరీరములను పొందించు కర్త ఈశ్వరుఁడు. ఆయన హేయగుణ రహితుఁడయినను జీవులకు వారివారిపుణ్యపాపములకుఁ దగిన సుఖదుఃఖముల నిచ్చునట్టి శరీరముల నిచ్చువాఁడు. ఆయనయే ఫలప్రదాత. పుణ్యపాపముల ననుభవించుటకు జీవులను, లోకాంతరములను, తదధిపతులను, దేవాసురులనుగూడ సృజించియున్నాఁడు. జీవులు తమతమ సత్క్రియాచరణములచేతను సాలోక్య, సామీప్య, సారూప్య రూపములగు నీశ్వరసన్నిధిని గాంచుటయే మోక్షము. ఇందు జీవేశ్వరులు సగుణులు. ఇవిగాక నింక కొన్ని ఆస్తికమతములు గలవు. కాని వానియందు పునర్జన్మ మంగీకరింపఁ లేదు. జీవుఁడు ఒక జన్మమందు చేసిన పుణ్యపాపములకుఁ దగిన ఫలము నాజీవుఁ డాజన్మమందె పొందునట్లు ఈశ్వరుఁడు చేయుచున్నాఁడు. కాని వేరుజన్మములు లేవనియును, తమ మతమవలంబించిన వారిపాపములను వారించి వారికి సుఖముమాత్రము ఆయన కలుగఁజేయుననియును, ఆ మతస్థులు పల్కుచుందురు. అట్టిమతములు క్రైస్తవ మహమ్మదీయాది మతములైయున్నవి. అవి నామతః జీవేశ్వరులను ఒప్పుకొన్నటువంటి ప్రచ్ఛన్న నాస్తికమతములతోఁ దుల్యమైయున్నవి. ఎందుచేత ననఁగా జీవులకుఁ బునర్జన్మము లేనిచో శరీరములకు నాశనము గనుపడుచున్నదిగదా! ప్రతి దినము పుట్టుచుండు జీవులెవరు? లేక ఎప్పటికప్పుడు జీవులను సృజించుచున్నాడందురా! ఉత్పత్తిగలదానికి నాశనము విధి గనుక ఆ శరీరము

తోనే యీజీవుఁడుగూడ నాశనము నొందవలయును. ప్రాఁతజీవులకే పునస్సృష్టియందు జన్మము లభించునందురా? అట్టిజన్మము గలుగువఱకును వారెక్కడనుందురు? పుణ్యపాపములు తిరుగా జన్మముకలుగకమునుపే యనుభవింతురందురా? పునర్జన్మమందు కొందఱధికులుగను, కొందఱు నీచులుగను పుట్టుట యసంభవము. ఇవి వెనుకటి సృష్టిలోని పుణ్యపాప లేశము లందురా? ఒక జన్మములోని పుణ్యపాపములకుఁ దగిన శరీరముల నీయకుండ వెనుకటిజన్మము తుదవఱకు ఎందుకు జీవులను నీశ్వరుఁడు నిల్పి యుంచె? ఏకారణంబును గానరాదు. ప్రతిజీవుఁడును పుణ్యపాపములు గలవాఁడు గనుక పాపములశిక్ష ననుభవించుటకు నిలిపినాడందురా? పుణ్యఫలానుభవమునకు వెంటనే జన్మము గలిగించవలెను. అట్లు చేయనిచో పుణ్యఫలానుభవముగూడ శిక్షవంటిదగును. జీవులయొక్క పుణ్యఫలానుభవములకు లోకములను సృజించెనందురో? ఆయాలోకపాలకులనుగూడ సృజించవలెను. జీవులనచ్చటికి తీసికొనిపోవుటకు దేవతలనుగూడ సృజించవలెను. ఆప్రకార మీక్రైస్తవ మహమ్మదీయాదిమతములు చెప్పుటలేదు. చెప్పినచో నవియు ద్వైతవిశిష్టాద్వైతములలోనే చేరును. మఱి యీఁదమతమ మతములను అవలంబించువారినే యీశ్వరుఁడు రక్షించు ననుటచే వీరిమతములందు నీశ్వరునకుఁ బక్షపాతబుద్ధి యారోపింపఁబడుచున్నది. ఈకారణములచేతనే క్రైస్తవ మహమ్మదీయాదిమతము లాస్తిక మతములోఁ జేర్పఁబడలేదు. ఇంతవఱకు సిద్ధాంతమతములోఁజేరిన ఆస్తికమతములగు ద్వైత విశిష్టాద్వైతమతసిద్ధాంతములను జెప్పియుంటిని. ఇఁకను వానిపై నాక్షేపణలను వివరించుచున్నాను.

౧. ఆమతములవారు జీవేశ్వరులు సగుణులని చెప్పినారుగదా, జీవేశ్వరులకుఁ గలదను గుణము చైతన్యసంబంధమయినదా? అచేతన (జడ) సంబంధమైనదా? అచేతనమైనచో నశించునదికావలెను. చేతనమైనచో సచేతనులయిన జీవేశ్వరులిద్దఱిలో నొకనికి హేయగుణ రాహిత్యమును నొకనికి హేయగుణ సాహిత్యమును నెట్లు తటస్థించెను?

౨. హేయగుణములు గలజీవుఁడు చేతనుఁడుగాఁడందురా? చేతనధర్మములైన జ్ఞానమును, నిత్యత్వమును జీవునకెట్లు సంభవించును?

3. హేయగుణములు జీవునకు లేవందురా? వానియందు రాగద్వేషాదులెందుకుఁ గనఁబడుచున్నవి?

౪. అవి ఉపాధిసంబంధమైనవందురా? ఈశ్వరునకుఁగల హేయగుణరాహిత్యమును ఉపాధిసంబంధమే కావలెను.

౫. ఆ యుపాధి చేతనమా యచేతనమా యని విచారించవలసియున్నది. చేతనమైనచో నుపాధివంతులగు జీవేశ్వరులకు విరుద్ధగుణప్రాప్తి యసంభవము. అచేతనమైనచో జడమునకు నశించు స్వభావము సహజము.

౬. జీవేశ్వరులకు గుణములు జడసంబంధములని తేలుచున్నది. కనుక వానికి నాశనము గనఁబడుచున్నది. ఆగుణములకు నశించు స్వభావమే లేనిపక్షమున ఈశ్వరున కుత్పత్తి వినాశములుగల సృష్టిచేయుటకు ఇచ్ఛయెట్లు సంభవించును?

౭. హేయగుణ రాహిత్యుఁడగు భగవంతుఁడు హేయగుణములుగల ప్రపంచమును సృజింప నిచ్ఛయించుట యసంగతము.

౮. ఈ యిచ్ఛస్వరూపసంబంధమైనదిగాని ఉపాధిసంబంధము కాదందురా? ఉత్పత్తి వినాశములు గల యిచ్ఛకు కారణమగు స్వరూపము గూడ నుత్పత్తివినాశములు కలదిగా నుండవలెను.

౯. ప్రళయకాలమందు జీవేశ్వరులకుఁగల గుణములును ఉపాధులును నశించునందురా? కేవల చేతనులయిన జీవేశ్వరులకు ఏకరూపమే కలిగియుండవలెనుగాని వేరురూపములు గలిగియుండుటకు వీలులేదు. వేరురూపము కలిగియున్నపక్షమున నీశ్వరునిసర్వవ్యాపకత్వమునకు హానివచ్చును. ఆ పక్షమందు జగత్తును సృజించుట యసంభవము.

౧౦. జీవేశ్వరులు పృథగ్రూపులందురా? మోక్షకాలమునందు సామీప్య సారూప్యములకు అభ్యంతరములు గలుగును.

౧౧. ఈశ్వరాంశమని కాని ఈశ్వరాంగమని కాని ఒప్పుకొనఁబడుచున్న జీవునియొక్క జన్మకర్మములు అంగియైన యీశ్వరుఁ డనుభవింపవలసి వచ్చును. ఎందుచేతననఁగా, ఎవనియొక్క అవయవములకుఁ గలుగు వ్రణ బాధలు మొదలగునవి యతఁడే యనుభవించుట యనుభవసిద్ధము.

౧౨. జీవుల పుణ్యపాపములకుఁ దగిన శరీరము లిచ్చుటకు ప్రపంచము పుట్టింపఁబడినందున అట్టి పుణ్యపాపములు శరీరముతోఁ జేయునవిగాని శరీరము లేకుండ చేయునవికావు. శరీరమునకు పూర్వము పుణ్యపాపములు లేనందున జగదుత్పత్తిచేయుట యసంభవము.

౧౩. ఈ శరీరమున వానికి భిన్నములయిన లోకములును లోకపాలకులును ఉన్నపక్షమున నవి కంటికి కనఁబడకపోవుటకు కారణము లేదు. ఇట్లు జగదుత్పత్తికి బాధకములు కనఁబడుచున్నందున నిది పూర్వపక్షమతమువంటిదికాదు. ఎందుచేతననఁగా జీవేశ్వరులు సచేతనులని యొప్పుకొనఁబడుచున్నది. ఈమతములం దీశ్వరుఁడు సగుణుఁడని చెప్పఁబడినను సచేతనుఁడని చెప్పుటవలన నీతఁడు నాశనరహితుఁడనియు, నట్టి యీశ్వరుని పొందుటవలన నాశములేని శాశ్వతసుఖము గలుగుననియు మంద మధ్యమజ్ఞానము గలవారికి సులభముగా తెలియఁదగియున్నది గనుక వీనిని సిద్ధాంతమతములుగా నెంచవలసియున్నది. ఇందు చెప్పఁబడిన భగవంతుఁడే సగుణబ్రహ్మానుందురు. పరమసిద్ధాంతమతమగు అద్వైతమతమును గుఱించి నాల్గవ ప్రకరణమందు వ్రాయఁబడును.



## నా ల్గ వ ప్ర క ర ణ ము.

### పరమసిద్ధాంతమతసంగ్రహావివరణము.

దీనికి, అద్వైతమతమని యపరనామము గలదు. ఇది "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యని బోధించుచున్నది. ఇది యేకమతము కానిచో నిదియును బూర్వపక్షమతములలో నొకటియగును. బ్రహ్మముకంటె వేరువస్తువు లేదనియు యీమతసిద్ధాంతము. బ్రహ్మముకంటె నుత్కృష్టమగు వేరొక్కటియున్నదని చెప్పుసిద్ధాంత మేమతమందును లేనికారణముచేతను, ఇది సర్వమత సామరస్యముగ నీశ్వరుఁడొక్కఁడే నిత్యుండనియు, తదితరమంతయు నశించునదియనియు సమర్థించుటచేతను నిదిపరమసిద్ధాంతమత మనఁబడుచున్నది. అద్వైత మనఁగా రెండవది (బ్రహ్మముకంటె భిన్నమైనది) లేదని యర్థము. ఈ మతసిద్ధాంతము లెవ్వియన,

1 బ్రహ్మముకంటె నన్యము లేదు.

1 బ్రహ్మస్వరూపము.

2 ప్రపంచాభావనిర్ణయము.

3 విపరీతగ్రహణ (ఉన్నదిలేనట్లు లేనిదియున్నట్లు మనస్సునకుఁ దోఁచుట) కారణస్వరూపము.

4 యథార్థనిశ్చయ జ్ఞానప్రయోజనము.

5 బ్రహ్మసాక్షాత్కారసాధనములు.

మనకీయైదంశములే విచారణీయములు. ఇవి తెలియుటచే నిశ్చయజ్ఞానము కలుగును. ఆయా మతఖండనలవలన నంతప్రయోజనము లేదు. ఇది యత్యంత బుద్ధిసూక్ష్మతవలనఁగాని తెలియదు. బ్రహ్మము కంటె నన్య మేమియును లేకపోయినను అట్టి యథార్థజ్ఞానమును బొందుటకై యీసిద్ధాంతమందు అధ్యారోపాపవాదములు చెప్పఁబడును. అధ్యారోపమనఁగా లేనిదానినున్నట్లు లారోపణచేయుట. అట్టి యారోపణ యుక్తులచేత మనము లేదనుకొను జగత్తు లేనిదేయని సమర్థించుటయే యపవాదమనఁబడును. బ్రహ్మవస్తువు అట్టి యధ్యారోపాపవాదములచేతనే తెలిసికొనఁబడును. పై నుదాహరింపఁబడిన యంశములను గుఱించి సవిస్తరముగా నైదవప్రకరణమునందు వ్రాయఁబడును.



## ఐదవ ప్రకరణము.

బ్రహ్మము సత్యమనియు, జగత్తు మిథ్యయనియు, బ్రహ్మముకంటె నన్యములేదనియు నద్వైతమతసిద్ధాంతము. ఆ బ్రహ్మస్వరూప నిశ్చయము మనమిప్పుడు చేయవలసియున్నది. బ్రహ్మ శబ్దమునకు ఘనమని యర్థము. సర్వాంశములయందుఁ దక్కినవానికంటె నెక్కువ ఘనముగునది లేకపోవుటచే దీనికి బ్రహ్మమని పేరువచ్చినది. ఇది యింద్రియగోచరము (That which can be perceived by Sensers) కాకపోవుటచే "ఇదమిత్థ" మ్మని నిరూపించి చెప్పుటకు వీలులేదు. దీని స్వరూప స్వభావములనుదెలుపు విమర్శలోఁ దేలుగుఱుతులనుబట్టి దీనిని నిశ్చయింపవలసియున్నది. ఇది శాఖాచంద్రన్యాయముచేఁ దెలియఁదగినది. ఆకాశమందు చంద్రునకు స్థలనిర్దేశము లేకపోవుటచే భూమిమీఁదనుండు చెట్టును

జూపి యూచెట్టుకొమ్మమీఁదుగా చంద్రుఁడునయించుచునని మనము చెప్పుచున్నాము. అటులే శరీరము నాధారముచేసికొని బ్రహ్మమును బోధించవలసియున్నది. అందుచేతనే బ్రహ్మమునుగూర్చి చేయువిమర్శకు "శారీరకమీమాంస"యని నామాంతరము కలదు. శరీరమనఁగా నశించునది యని యర్థము. ఉత్పత్తియైన శరీరము నశించువఱకు నవయవాదులతోఁగూడి యుత్పత్తిస్థితులతో నొప్పుచుండును. శరీరములయుత్పత్తిస్థితిలయములకుఁ గారణమేదియని మనము విచారించవలసియున్నది. శల్య, రక్త, మాంస, చర్మ, సిరలతోఁ గూడిన యీ శరీరము జడము. (Matter) కనుక నట్టిశరీరము నడుపుటకు వ్యక్తి (Active intelligence) తోఁ గూడిన సత్త (Force) యొక్కటి యుండి తీరవలయును. అదియే ప్రాణము (లేక) చైతన్యమని వాడఁబడును. అట్టిప్రాణము శరీరములో నుండు రక్తమనియు, జఠరాగ్నియనియు, నుచ్ఛ్వాసరూపకమగు వాయువనియు, నన్న మనియు, బంచభూతము లనియు, అంతఃకరణములనియు ననేకు లనేకవిధములుగా వాదింపఁజూచిరి గాని యవి యన్నియు జడము లగుటచేతను స్వతంత్రశక్తిలేని వగుటచేతను, పరాపేక్ష కలవి యగుటచేతను, నిత్యమగు ప్రాణము (లేక) చైతన్యము కానేరవని సయుక్తికముగా మొదటిప్రకరణములో వ్రాసియున్నాము. ప్రాణమనునది శుద్ధమైన చేతనమగు జ్ఞానసత్త యయియున్నది. అది శరీరమంతటను వ్యాపించి యున్నది గాని శరీరములో నొకభాగముకాదు. శరీరమందలి యింద్రియములకు వేరు వేరు గుణము లున్నను, అవి జ్ఞానముయొక్క సత్తవలననే వికసించుచున్నవి. లేనిచో జడములగువానికి స్వతంత్రశక్తి కలుగనేరదు. ఎట్లన, పృథ్వీప్రాధాన్య భూతజన్యములగు వాక్పాణిపాదపాయూపస్థములు కర్మేంద్రియము లనఁబడును. ఇవి చేయుకర్మములు శరీరమునకు మిక్కిలి ప్రయోజనములు. జడములగు కర్మేంద్రియములు జ్ఞానముయొక్క సత్తనుపొందకుండ నాయాకర్మములఁ జేయనేరవు. జలప్రధానభూతజన్యములగు శబ్దస్పర్శరూప రసగంధములు రసనేంద్రియము లనఁబడును. ఇవి జ్ఞానేంద్రియములతోఁ గలిసికొని శరీరమునకు మిక్కిలి యుపయోగముగ నుండుచున్నవి. అట్లు కలిసికొనుటకును ఆయాపనులు చేయుటకును జ్ఞానముయొక్క సత్తలేకుండ జడములగు రసనేంద్రియములకు స్వతంత్రశక్తి కలుగుట యసంభవము. అగ్నిప్రధానజన్యములగు త్వక్చ

క్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు జ్ఞానేంద్రియములు. వీనికి రసనేంద్రియములను స్వీకరించునట్టి వ్యక్తి కలిగియున్నది. ఇది జ్ఞానము లేక కలుగునది కాదు. వాయుప్రాధాన్యభూత జన్యములగు ప్రాణాపాన వ్యానోదాన సమానములు ప్రాణేంద్రియము లనఁబడును. వీనికి శరీరములోని చెడుగులను హరించి శుభ్రపఱుచు సంచారము సర్వదా కలిగియుండును. ఇట్టి శక్తి జ్ఞాన సహాయము లేక జడములకుఁ గలుగనేరదు. ఆకాశజన్యములగు అంతఃకరణ మనోబుద్ధి చిత్తాహంకారము లంతరింద్రియము లనఁబడును. ఇవి సత్త్వ రజస్తమోగుణ వికారములు కలిగి శరీరమునకు నియామకములగు సంకల్పేచ్ఛాదులతోఁగూడిన గ్రహణశక్తి గలిగియున్నవి. ఈ వ్యక్తి జ్ఞానము లేక కలుగనేరదు. ఇట్లు సర్వేంద్రియములకును జ్ఞానమే యాధారమయియున్నది. జ్ఞానమే చైతన్యస్వరూపము. అట్టి చైతన్యమే ప్రాణము గనుక ప్రాణము శరీరమున కాధారము. కానిచో మృతకళేబరమునకుఁ బూర్వోక్తశక్తులు కనిపించవలసివచ్చును. ఇది యనుభవవిరుద్ధము. ప్రాణము శరీరముకంటె భిన్నమైనను ప్రాణము లేకుండ శరీరము నిల్వనేరదు గనుక ప్రాణము లేని బీజము ఉత్పత్తి యగుటకు వీలులేదు. శరీరముల యుత్పత్తిస్థితులకుఁ గారణమైన ప్రాణమే లయమునకును గారణమగుచున్నది. అట్టి ప్రాణమే బ్రహ్మస్వరూపము. ఘటాకాశమువలె నుపాధి భేదమువలన బ్రహ్మము ప్రాణములు భేదముగాఁ గనిపించునుగాని వాస్తవముగా భేదస్వరూపము బ్రహ్మముగలిగి యుండలేదు. బ్రహ్మము సర్వవ్యాపకుఁడై యున్నను ఆయనకు జ్ఞానమే స్వరూపముగాని గుణములు లేవు. అట్టి గుణము లుండుటకు నవసరము లేదు. ఎందుచేత ననఁగా జ్ఞానముకంటె నానందములేదు గనుక జ్ఞానమే స్వరూపముగాఁగల బ్రహ్మము సంపూర్ణానందమయుండగుచున్నాఁడు. సంపూర్ణానందమందు కొఱంతలు లేవు గనుక నిచ్ఛాదు లుండుటకు నవసరము లేదు. అందువలన సుగుణదుర్గుణము లుండుట కవసరము లేదు. ఇంతవఱకు బ్రహ్మము సత్యజ్ఞానానందస్వరూపుఁడని తేలుచున్నది.

శరీరమునకు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాత్రయ ముండుటచేత నింద్రియాదులు విశ్రమించుట కలదు గాని బ్రహ్మము సర్వదా నిత్యుఁడై యొకేతీరుగా నుండును. జాగ్రదవస్థ యనఁగా నన్నియింద్రియములును

వ్యక్తితో నుండుకాలము. అప్పుడు జ్ఞానస్వరూపుఁడగు బ్రహ్మము శరీర మంతట వ్యాపించి విశ్వుఁడని చెప్పఁబడును. స్వప్నావస్థ యనఁగా బహిరింద్రియములు విశ్రమించి అంతరింద్రియములు మాత్రమే వ్యవహరించుకాలము. అంతరింద్రియములయందు జ్ఞానముయొక్క సత్త కలిగి యుండుటచేతనే వానికప్పుడు గ్రహణశక్తి కలిగియుండును. అందుచేత సర్వవ్యాపి యగు బ్రహ్మము విశ్రమించి యుండలేదని స్పష్టము. ఈయవస్థయందు బ్రహ్మము తైజసుఁడని చెప్పఁబడును. సుషుప్తి యనఁగా సర్వేంద్రియములును విశ్రమించి యుండుకాలము. ఇది గాఢనిద్ర. దీనియందుఁగూడ బ్రహ్మము విశ్రమించి యుండలేదనుట కట్టినిద్రనుండి కలిగిన యానందము జాగ్రదవస్థను బొందుచు లేచునట్టి యింద్రియములకు మంచినిద్ర పోయినా నని మొట్టమొదట గోచరించుటయే ముఖ్యకారణము. ఈయవస్థలో బ్రహ్మము ప్రాజ్ఞుఁడనఁబడుచున్నాఁడు. ఇట్లు విశ్వతైజసప్రాజ్ఞు లనిచెప్పఁబడు బ్రహ్మ మొక్కఁడే కాని త్రిమూర్తులు కాఁడు. అట్టిబ్రహ్మము నిత్యుఁడు. అట్టి బ్రహ్మముండే సుషుప్తియందు ఇంద్రియములు లయము నొందుట గాని లేక విశ్రమించుట గాని జరిగి యుండుటవలన మరల జాగ్రదవస్థయందవి లేచుటకుఁ గారణమగుచున్నది. నిద్రాకాలములోఁగూడ శరీరమును గాపాడు ప్రాణవాయువు మొదలగునవి పని చేయుచుండుట స్పష్టము. అట్టిపని జ్ఞానముయొక్క సత్త లేకపోయినచో జరుగనేరదు. కనుక బ్రహ్మముకూడ నింద్రియాదులవలె పడిపోవువాఁడు కాఁడనుట స్పష్టము. అట్లుపడిపోయెనేని నిద్రించువారు తిరుగ లేచుటకే కారణము కనఁబడదు. అయినను, మరణము కలుగునప్పుడు పడిపోవు సర్వేంద్రియములు మరల లేచుట లేదు గనుక బ్రహ్మముకూడ పడిపోయి యుండవలెనందు రేమో? అది సరికాదు. శరీరము జడము. అది వికారసహితము. అందుచేత శరీర ముత్పత్తిని జెంది పెరిఁగి జీర్ణమగుట స్వాభావికము. అట్టిశరీరములో నుండి దానిని నడుపుబ్రహ్మము నిర్వికారమగు సత్త (Force) గాని జడము (Matter) కాదు. బ్రహ్మము జడమే యైనచో నొకశరీరము వేఱొకశరీరముతోఁ గలియుటకుఁగాని విడిపోవుటకుఁగాని సావకాశము లేక శరీరోత్పత్తికే కారణము లేకపోవును. బ్రహ్మము నిర్వికారుఁడగుటచే మట్టిలోనుండు కుమ్మరపురుగువలె శరీరములో నున్నను శారీరకసుఖ

దుఃఖరూపపంకమును బొందఁడు. అందువలన శరీరమున కున్న జనన మరణాదులు బ్రహ్మమున కుండవు గనుక బ్రహ్మము స్వయంభువును నిత్యుఁడునై యున్నాఁడు ఉత్పత్తిస్థితి లయములుగల శరీరములు బ్రహ్మమునకు పురుషుఁడు ధరించు వస్త్రములవంటివి. పురుషుఁడు జీర్ణవస్త్రమును విడిచి నూతనవస్త్రమును ధరించునప్పుడు వస్త్రములు మారుటయే గాని పురుషుఁడు మారుటలేదు. అటులనే నిత్యుఁడై పరిపూర్ణుఁడై యుండు బ్రహ్మమును శరీరములు పొంది విడిచిపోవుచున్నట్టు కనుపడుచున్నవి, గాని యొక శరీరములో నుండి లేచి మఱియొక శరీరములోనికి బ్రహ్మము ప్రవేశించుటలేదు. అందువలన బ్రహ్మమునకు జన్మాంతరములు లేవు. ఆయనకు ఆకారము గాని పరిమాణముగాని యవయవాదులుగాని గుణవికారములుగాని లేవు. పదార్థము కాదు గనుక దేనివలనను బుట్టబడఁదగినవాఁడు కాఁడు. ఆకాశమువలె సర్వవ్యాపకుఁడు గాని ఆకాశమువలె సత్త లేనివాఁడు కాఁడు. జ్ఞానమే ఆయన స్వరూపము. ఒక ఘటములోనున్న ఆకాశము (Space) ఆ ఘటము భిన్నము కాఁగానే స్థలాంతరము నెట్లుపొందునో అటులనే ఆత్మ (లేక) బ్రహ్మము చలించనివాఁడైనను సూక్ష్మశరీరములో నుండి స్థూలశరీరములోఁ బ్రవేశింపఁగునని తోఁచవచ్చును గాని యది సరికాదు. సూక్ష్మశరీరము జడము (Matter) అగునెడల స్థూలశరీరమువలె నశించునది కావలెను. చేతనమైనయెడల ఆత్మలో నేకమే యగును గనుక శరీరవిభాగమే లేకపోవును. స్థూలశరీరముకన్న వేఱుశరీరము లుండుటకు వీలులేదు. ఉన్నయెడల అవి గోచరము కావలెను. వానియుత్పత్తికి శుక్లశోణితములవంటి బీజము లుండవలెను. అది యనుభవవిరుద్ధము సూక్ష్మశరీరములో లింగశరీరమనియు, కారణశరీరమనియు, రెండుభాగములు చెప్పుచున్నారు. లింగశరీరము జ్ఞానేంద్రియకర్మేంద్రియ ప్రాణేంద్రియములు స్వరూపము గాఁగలది యగుటచే స్థూలశరీరముయొక్క భాగమే కావలసివచ్చుచున్నది. కారణశరీరములో జ్ఞానమేయని చెప్పఁబడుటచే దీనికి రూపము లేదనుట స్పష్టము. ఒకవేళ సూక్ష్మలింగశరీరములు స్థూలశరీరములోని భాగములుగా నున్నవనునెడల నొకయిల్లు కాలిపోవునప్పుడు దానిలోని గదులుకూడ కాలిపోవునట్లు స్థూలశరీరముతోపాటు సూక్ష్మశరీరములు కూడ నశించిపోఁదగినవి. సూక్ష్మశరీరములను ప్రతీతియేగాని స్థూలశరీర

మునకంటె భేదమైన రూపము గనఁబడదు. సూక్ష్మశరీరములున్నను యింద్రియభేదములతోఁగూడి యుండవలెను. ఇంద్రియవిశ్రాంతినిఁ బట్టి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాదు లేర్పడినవి గాని మూఁడుశరీరము లుండుటవలనఁ గాదు. ఈ కారణములనుబట్టి స్థూలశరీర ముండునెడల సూక్ష్మశరీరము లుండునవియు, అది లేనియెడల లేనివియు ననుట సిద్ధాంతము. అచలుఁడును, నిష్కాముఁడును జ్ఞానస్వరూపుఁడును నగు బ్రహ్మము జడమగు శరీరమునెట్లు ధరించె నని సందేహము గలుగును గాని యతఁడట్లు ధరించుట లేదనియు, అట్లు గోచరించుట భ్రాంతిజనక మనియు ముందు వివరింపఁబడును. ఇంద్రియాదు లసత్యములు గనుక నిత్యుఁడును, ఇంద్రియాతీతుఁడును నగు బ్రహ్మము వానికి గోచరింపఁడు. ఆ యింద్రియముల కున్నట్టు గనఁబడు జ్ఞానమునకు మించిన స్వరూపముఁ గలవాఁడు గనుక బ్రహ్మము వానికి గోచరింపఁడు. ఏలాగున ననిన? శబ్దాతీతుఁడు గనుక శ్రోత్రేంద్రియమునకును, వస్తువు కాఁడు గనుక త్వగింద్రియమునకును, రూపము లేదుగనుక నేత్రేంద్రియమునకును, రసభిన్నుఁడు గనుక జిహ్వేంద్రియమునకును, గంధగుణము లేదుగనుక ఘ్రాణేంద్రియమునకును గోచరింపఁడు. ఇట్లు జ్ఞానేంద్రియములకే గోచరింపఁడు గనుక తక్కినయింద్రియములకు గోచరింపఁడని వేఱుగ చెప్పనక్కఱలేదు

ఇంద్రియములకు గోచరింపఁడు గనుక బ్రహ్మము లేదనుటకు వీలు లేదు. బ్రహ్మము లేదనుటచే జ్ఞానము లేదనవలసి వచ్చును. జ్ఞానము లేదనుట అనుభవవిరోధము గనుక బ్రహ్మముకలదనుట నిస్సంశయము. ఆ బ్రహ్మము సత్యజ్ఞాన స్వరూపుఁడును, ఆనందమయుఁడును, నిర్వికారుఁడును, నిర్గుణుఁడును, నామరూపక్రియారహితుఁడును, పరిపూర్ణుఁడును, సర్వవ్యాపకుఁడును, అపరోక్షజ్ఞానగమ్యుఁడును, అనుభవైకవేద్యుఁడును నని తెలియఁదగినయది బ్రహ్మముకంటె నన్యము లేదుగనుక మనకు గోచరించు ప్రపంచము మిథ్య కావలవచ్చినది. అట్టి ప్రపంచమున్నదా? లేనిదా? లేనిది యున్నది యని గోచరించుటకుఁ గారణ మేమి? యని విచారింతము.

## ప్రపంచభావనిర్ణయము.

ప్రపంచము సత్యమనుటకుఁ గారణ మది గోచరించుటయే. గోచరించుట యనఁగా నింద్రియములకుఁ గనఁబడుట. ఆ యింద్రియములెవ్వి? వాని గుణమెట్టిది? యని విచారించవలసియున్నది. ఇంద్రియములు బహిరింద్రియములు, అంతరింద్రియములని రెండువిధములు. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లనునవి బహిరింద్రియములు. ఇవి శబ్దస్పర్శరూపరసగంధములను గ్రహించి యంతరింద్రియములకుఁ గొనిపోవుటచే వానికి జ్ఞానేంద్రియములని నామము కలిగినది. కాని యది "నేతిబీరకాయ" శబ్దమువంటిది కాని సార్థకమైనది కాదు. ఒకయింటికున్న కిటికీ యింటిలోనివారికి బయట నున్నవస్తువులఁ గనఁబడునట్లు చేయుటకుమాత్రమే యుపయోగపడునట్లు బహిరింద్రియములు అంతరింద్రియముల కుపయోగించునుగాని అంతకన్న నెక్కుడ ప్రయోజనములు గావు. అంతరింద్రియము లనఁగా మనోబుద్ధి చిత్తాహంకారములును అంతఃకరణమునై యున్నవి. ఇవి గుణభేదములచే నామభేదములను బొందినను ఏకరూపమే గనుక సౌలభ్యముకొఱకు అంతరింద్రియములనఁగా మనస్సని యిందు వాడుకొందుము. ప్రపంచము గోచరించుట బహిరింద్రియములకా? అంతరింద్రియములకా? ఈ రెంటి సమావేశమువలననా? యని యోజింతము. మనస్సు మఱియొకచింతనతోనున్నప్పుడెదుట నున్న వస్తువులనుజూచి గ్రహించుటకాని యితరులాడు మాటలువిని గ్రహించుటకాని, స్పర్శాదికము గ్రహించుటకాని, మనకుఁ గలుగుట లేదు. అందువలన బహిరింద్రియసాహాయ్య మక్కఱలేకయే మనస్సు ప్రపంచమును గ్రహించుచున్నదనుట స్పష్టము. అట్టి మనస్సుయొక్క స్వకీయమగు గుణము దానికి నితరసంబంధము లేనిసమయమునందు నైజమగు దాని చేష్టలవలనఁ గదా గ్రహించవలసినది? అట్టి సమయము స్వప్నసమయము. స్వప్నమందు బహిరింద్రియములు విశ్రమించి యుండును. అంతరింద్రియములుమాత్రము పనిచేయుచుండును. స్వప్నములోఁ దోఁచువస్తువులును చేయఁబడుపనులును, స్వప్నించు మనుజుఁడు స్వప్నకాలమునందు వాస్తవములని నమ్ముచున్నాఁడు, స్వప్నములోని వస్తువులు యథార్థముగాదనుట సుప్రసిద్ధమే గనుక

మనస్సునకు లేనివస్తువు లున్నట్లు గ్రహణము చేయుట స్వభావసిద్ధ మగుగుణమై యున్నది. ఒకవేళ స్వప్నములోఁ జూచినదంతయు అసత్యమని జాగ్రదవస్థయందు తెలియఁబడుచున్నది గనుక అది అసత్య మనుట యుక్తమే గాని జాగ్రదవస్థయందుఁ గనఁబడునది అసత్య మనుట కేమికారణ మని సంశయము గలుగవచ్చును. అట్టి సంశయముతోఁ బని లేదు. ఏల యన? స్వప్నావస్థలో నున్నప్పుడు స్వప్న మసత్య మని తెలియలేదు. అటులే జాగ్రదవస్థలోఁ గనఁబడునది అసత్యమని ఆయవస్థలోఁ దెలియదు. అనఁగా జాగ్రదవస్థయును స్వప్నమువంటిదే యని యర్థము. నిద్రకుఁ బూర్వము గోచరించు ప్రపంచము నిద్రానంతరము మరలఁ గనిపించుటచే నది సత్య మందురేమో? అది సరికాదు. ఏల యనఁ? స్వప్నములోఁ దాను, అనేకసంవత్సరములు వ్యవహరించునట్లును, అందులోఁ గడచిన పెక్కుదినములఁ దాను నిద్రించునట్లును, ఆ నిద్రలోఁ బెక్కుస్వప్నములు దనకుఁ గలిగినట్లును, ప్రతివానికిని గనఁబడుచున్నది. అందువలన నిద్రకు పూర్వపరములు రెండును స్వప్నములే గనుక స్వప్నములోని వన్నియు నసత్యము లగుటచేతను మనస్సునకుఁ గోచరించు ప్రపంచము వాస్తవముగా స్వప్నగతవస్తువువలె లేనిది కావలసివచ్చినది. అదినటుకు మనము చూచినవే స్వప్నమందుఁ దోఁచుచున్న వన నెన్నఁడును జూడనివస్తువులు గూడ స్వప్నమందుఁ దోఁచుటచేత నట్లనుటకు వీలులేదు. ఏమితోఁచినను మనస్సునకే గనుక మనస్సుయొక్క స్వకీయగుణము లేనిది యున్నట్లు దోఁచుట గనుకను ప్రపంచము లేనిదే యనుట స్పష్టము. ఇదిగాక, ప్రపంచము జడము గనుక నిత్యము కాదు. బ్రహ్మము నిర్గుణుఁడు గనుక జగములను బుట్టించు నిచ్ఛ యతనికిఁ గలుగుటకు వీలులేదు. ఆనందమయుఁడును, పరిపూర్ణుఁడును, నిష్కాముఁడును, గనుక అతనికిఁ గోరికతో నవసరము లేదు. ఆయనయందు ప్రపంచము తనంతటనే కలుగుచున్నదన్నచో చేతనమందు అచేతనము పుట్టుటకు వీలులేదు. ఏపిత్తున కాచెట్టు పుట్టుట అనుభవసిద్ధము. ప్రపంచము జడము గనుక స్వాతంత్ర్యశక్తి లేదు. చేతనమువలె ప్రపంచము స్వయంభువనుట యసంగతము. దీనికి నుత్పత్తివినాశములు గనఁబడుచున్నవి. ప్రపంచోత్పత్తికి నవకాశమే లేనందున దానికిఁ గారణముగూడ లేదు. ప్రపంచము

లేనిచో శరీరమును లేనిదే కావలెను. ప్రపంచశరీరములు లేనియెడల మనస్సు కూడ లేకపోవచ్చును. ఎట్లన? శరీరాదులకువలె మనస్సునకు సావయవములు లేవు కాబట్టి అది యుత్పత్తి గాఁదగినవస్తువు గాదు. మనస్సు నాశనములేని స్వయంభువగు పదార్థ మందురా? అది చేతనము గానందునను, వికారయుక్త మైనందునను నాశనము లేనిది యనుటకు వీలులేదు. అది శరీరజన్య మగు గుణవిశేషమే యందురా? శరీరాభావమందు మనస్సునకును అభావమే సిద్ధము. మనస్సులేనిచో మనస్సునకు సహజమగు లేనిది యున్న ట్లనుకొను విపరీతగ్రహణముకూడ లేకపోవలె నందురేమో? అది సరికాదు. మనశ్శరీరములు లేకున్నను విపరీతగ్రహణ ముండుటకు హేతువు లున్నవి. ఏమనిన? విపరీతగ్రహణ కారణము, అసత్యమును సత్యముగాను, సత్యము అసత్యముగాను గ్రహించుటయే విపరీతగ్రహణము. అది మనస్సునకు సహజగుణమని యిదివఱకుఁ జెప్పఁబడినది. అది యజ్ఞానమువలనఁ గలుగుచున్నది. అట్టి యజ్ఞానము శరీరేంద్రియజన్యమా? తదతీతమా? అని విచారించవలసి యున్నది. శరీరేంద్రియ జన్యమైనచో శరీరము పోయినతోడనే అజ్ఞానముకూడ పోవలసివచ్చును. అట్లు పోవుటలేదు. బ్రహ్మమునకు అసత్యము గోచరింపదు. గనుక శరీరమునకు ముందు అజ్ఞానము లేకపోయినచో మనస్సునకిట్లు గోచరించుట యసంభవము. శరీరమునకుత్పత్తి నాశనములు వాస్తవములుగాని కల్పితములు గావని చెప్పినప్పటికిని అజ్ఞానము శరీరముచేతఁ గలిగిన దనుటకు వీలులేదు. ఏలయన? భోగేచ్ఛ లేకుండ శరీరము నుత్పత్తిచేయుటకు వీలులేదు. అట్టిభోగేచ్ఛ జ్ఞానముచేత సంభవించునది కాదు. అట్టియిచ్ఛలు మనస్సునకుఁ గలిగియున్నందువల్లను, మనస్సు శరీరజన్యమే అగుటవల్లను శరీరోత్పత్తి కవకాశము గలుగును. అజ్ఞానమువల్ల అట్టి యిచ్ఛలు మనస్సునకుఁ గలిగిన వనిన అది బాగుగ నుండును గాని, అట్టి యజ్ఞానమునకు శరీరమే ఆధారమైన పక్షమున మొదటిశరీరమునకు ముందు అజ్ఞాన ముండుటకు వీలులేక పోవును గనుక అజ్ఞానము శరీరేంద్రియములవల్లఁ గలుగునది కాదు. తదతీతమైన దగుచున్నది. అది శరీరాదులతో వచ్చినదికాదు. వానితోఁ బోవునదియుఁ గాదు. అందువలననే అజ్ఞానము నాశనము లేని దనవలసి వచ్చెను. అందువల్ల అజ్ఞానముకూడ బ్రహ్మముతో సమాన

మగును. బ్రహ్మము లేకపోవలసివచ్చును. అజ్ఞానము నాశనము లేని దైనచో విద్యాభ్యాసమునకుఁ బూర్వ మెట్లు తెలివితేటలు లేకుండునో విద్యాభ్యాసమునకుఁ దరువాతఁగూడ నట్లునే తెలివితేటలు గలుగ కుండును. అది యనుభవమునకు విరోధము గనుక నజ్ఞానము నాశన రహితమైనది కాదు. ఈయజ్ఞాన మెవరికిఁ గలుగుచున్నది! యెందులకుఁ గలుగుచున్నది? యని విచారింతము. జ్ఞానముగలవానికి అజ్ఞానము గలుగుట యసంభవము.

అజ్ఞానవిషయములో నెవరి కని ప్రశ్న పుట్టుటకే వీలులేదు. ఎందుకుఁగలిగిన దనఁగా? యథార్థజ్ఞానము లేకపోవుటచేతనే యేవిషయ ములోనైనను నిజము దెలియఁగానే సంశయవిచ్ఛేద మగుననుట అనుభ వసిద్ధమే. ఈకారణములచేతను బ్రహ్మవిషయమైన యథార్థజ్ఞానము గలుగఁగానే అజ్ఞానమును, విపరీతగ్రహణమును, మనస్సును, శరీరేంద్రి యాదులును లేనివే యనియును, అందువల్లఁ బ్రపంచముకూడ లేనిదే యనియు ఉన్నది బ్రహ్మమొక్కటే అనియును, అనుభవమునకు వచ్చును.

## యథార్థ నిశ్చయజ్ఞానప్రయోజనము.

అజ్ఞానమునకు విపరీత జ్ఞానమనియు, ప్రమాద జ్ఞానమనియు, భ్రాంతి యనియు, నామాంతరములు గలవు. యథార్థజ్ఞానము కలు గుటచే నజ్ఞానమును దత్సంబంధమైన బాధకములును లేకపోవుటయు, శాశ్వతానందము గలుగుటయుఁ బ్రయోజనములు. యథార్థ నిశ్చయ జ్ఞాన మనునదిఅపరోక్షజ్ఞానమే గాని ప్రత్యక్ష పరోక్షజ్ఞానములు గావు. ప్రత్యక్ష మనఁగా, ఎదుటఁ గనఁబడునది. పరోక్షమనఁగా, ఎదుటఁగనఁ బడక సంగతి సందర్భములవల్లఁ దెలియఁబడునది. అపరోక్ష మనఁగా ప్రత్యక్షముకంటె ఘనము. తన్నుఁ దానే తెలియుట, ప్రత్యక్షము, ఎదుట సంభవించునపుడె తెలియునుగాని మఱియొకప్పుడు దెలియదు. అపరోక్షము, తన్నుఁ దాను దెలిసికొనినపక్షమున సర్వదా పొందఁబడు నది గాని ఒకప్పుడుమాత్రము దెలిసి మఱియొకప్పుడు దెలియకపోవు నది కాదు. కనుకనే ప్రతి మనుజునకును దన్నుఁదాఁ దెలిసికొనుటయే విధి "బ్రహ్మైవాహ" మ్మను నిశ్చయమును దెలిసికొనుటయే బ్రహ్మ

సాక్షాత్కారము. అందులకు వలయు సాధనములను గుఱించి ముందు ప్రకరణములో సంగ్రహముగా వివరింపఁబడును.



## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

### బ్రహ్మసాక్షాత్కారసాధనము.

అద్వైత మతసిద్ధాంతములలో "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యనుటయే ప్రధానాంశమై యున్నది. జగత్తు మిథ్య యనియు, బ్రహ్మము కంటె సత్య ముండుటకు వీలు లేదనియు, బ్రహ్మము నిత్య మనియు నిదివఱకే సయుక్తికముగా సమర్థింపఁబడినది. ఇందు బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనము లెవ్వి యని విచారింపఁబడును. బ్రహ్మ మింద్రియగోచరము కాదు గనుక ప్రత్యక్ష పరోక్ష జ్ఞానసాధ్యము కాదు. బ్రహ్మ మిట్టిదని యపరోక్షజ్ఞానముచేతనే తెలియఁదగినది. కన్నులకు నెదుట నుండువస్తువును చూచి యిది ఫలానిది యని తెలిసికొనుట ప్రత్యక్షజ్ఞానము. కన్నులకు నెదుట లేకపోయినను ఆకారాది గుణవిశేషముల సామ్యమునుబట్టి యొకవస్తువు ఫలానిది యని తెలిసికొనుట పరోక్షజ్ఞానము. రూపనామక్రియాది గుణరహిత మయిన దగుటచే బ్రహ్మము పూర్వోక్తజ్ఞానములచేఁ దెలియఁదగినది కాదు. ప్రత్యక్ష పరోక్షములకంటె భిన్నమైనది యపరోక్షజ్ఞానము. ఉదాహరణము:— కన్ను, ఎదుట నున్నరూపమును గ్రహించునుగాని యెదుటిరూపములను గ్రహించుకన్ను తనరూప మిట్టిదని తెలియఁజాలదు. తనరూప మిట్టిదని తన్ను తాను చూచుకొని తెలిసికొనుటయే అపరోక్షజ్ఞాన మనఁబడును. కాఁబట్టి బ్రహ్మజ్ఞాన మనఁగా తన్ను తాను తెలిసికొనుట యని పరిణమించుచున్నది. అట్టి బ్రహ్మమును తెలిసికొనుటకు శ్రవణ, మనన, నిదిధ్యాసలే సాధనములు. శ్రవణ మనఁగా శ్రోత్రేంద్రియములచేత బ్రహ్మమునుగుఱించి శాస్త్రములందుఁ జెప్పఁబడిన యంశములను వినుట. బహిరింద్రియములవలన తెలియఁబడినవాని నంతరింద్రియములచే గ్రహించి తత్సమాహారమగు మనస్సుచేత విమర్శించి బ్రహ్మ మిట్టిదని దాదాపుగా గ్రహించుచుండుటయే మననము. శ్రవణమన

నములచేఁ దెలియఁబడిన బ్రహ్మతత్త్వమును సర్వకాల సర్వావస్థలయందును తైలధారావిచ్ఛిన్నమై, యనన్య వ్యాపారరూపకమగు నేకాగ్రభక్తి గల చిత్తముచే ననుభవమునకుఁ దెచ్చుకొనుటయే నిదిధ్యాస. ఈ శ్రవణ మనన నిది ధ్యాసలకే బ్రహ్మజిజ్ఞాస యని పేరు. బ్రహ్మజిజ్ఞాస యన బ్రహ్మమును దెలిసికొనెడి యిచ్ఛ. అట్టి బ్రహ్మజిజ్ఞాస కధికారము సాధన చతుష్టయసంపత్తివలనఁ గాని కలుగదు.

సాధనచతుష్టయసంపత్తియనఁగా—(1) నిత్యానిత్య వస్తువివేకము (2) ఇహాముత్రఫలవిరాగము (3) శమదమాది షట్కసంపత్తి (4) ముముక్షుత్వము. ఇందు (1) నిత్యానిత్య వస్తువివేకమనఁగా నిది నశించునది, ఇది శాశ్వతమయినది యని తెలిసికొనుట (2) ఇహాముత్రఫల విరాగ మనఁగా, ఇహలోక పరలోక సుఖములం దిచ్ఛను త్యజించుట యనఁగా నేసుఖములయందును నిచ్ఛ కలుగకుండుట (3) శమదమాది షట్కసంపత్తియనఁగా (1) శమము (2) దమము (3) ఉపరతి (4) శ్రద్ధ (5) తితీక్ష (6) సమాధానము. శమ మనఁగా బహిరింద్రియ నిగ్రహము. దమ మనఁగా నంతరింద్రియనిగ్రహము. ఉపరతి యనఁగా మనము చేయు సర్వకర్మములు బ్రహ్మమందు సమర్పించుట. శ్రద్ధ యనఁగా బ్రహ్మజిజ్ఞాసయందు నిష్ఠగలిగి యుండుట. తితీక్ష యనఁగా సుఖదుఃఖములను సమముగా సహించుట. సమాధాన మనఁగా మనసునఁ గలుగు సంశయములను ఛేదించుకొనుట (4) ముముక్షుత్వమనఁగా మోక్షము పొందవలెననెడి యిచ్ఛ. ఇట్టి సాధన చతుష్టయ సంపత్తి గలిగియుండుటయే చిత్తశుద్ధి గలిగియుండుట. అట్టి చిత్తశుద్ధి గలుగుటకుఁ గొన్ని సాధనములు గలవు. (1) క్రమ ముక్త్యుపాసనలు. వీనికిఁ గర్మాపేక్ష లేదు. (2) అభ్యుదయోపాసనలు. ఇవియు స్వతంత్రములే (3) కర్మసమృద్ధ్యుపాసనలు. ఇందు మూఁడవదానిలో రెండుతరగతులు కలవు. (1) ప్రతీకోపాసనలు. (2) అంగావబద్ధోపాసనలు. ఇవి యుద్గీథలు సామలు. ఇవి కర్మముతోఁ జేయవలయును. ఈ యుపాసనలలో మొదటివి మిగిలినవానికి సహాయ సాధనములైయున్నవి. ఈ యుపాసనలన్నియు దేవతాదిస్థానములయందు బ్రహ్మదృష్టిచేఁ జేయు మననమై యున్నది. ఈ విద్యల నుపాసనచేయుటకు ముందు ద్విజత్వమును పొందవలయును. ద్విజుఁ డనఁగా రెండవసారి జనించువాఁడు. ఈ రెండవజన్మము ప్రథమజన్మమువలె నధోరేత

విధముగా కలుగ నేరదు. దీనినిబట్టి విచారించఁగా నిర్గుణోపాసనకు సగుణోపాసనయు, నా సగుణోపాసనకు కర్మాచరణమును, నా కర్మాచరణములో ముఖ్యకర్మాచరణమునకు గౌణకర్మాచరణమును విధిగా కనిపించుచున్నవి. అట్లు కర్మముల చేయక మానసికముగా ధ్యానము చేయుచున్నామనువారు సహజ చంచలమగు మనోవృత్తిని నిరోధించఁజాలక పోవుటచేతను నిత్య కర్మాచరణము చేయకపోవుటచేతను ఉభయభ్రష్టు లగుచున్నారు. కాఁబట్టి ప్రతివారును తమ తమ వర్ణాశ్రమ ధర్మములగు గౌణకర్మముల నాచరింపవలెను. అందువలన ముఖ్యకర్మాచరణము సులభముగా నలవడును. దానివలన చిత్తశుద్ధి కలుగును. అందువలన బ్రహ్మమును గుఱించి తెలిసికొనుటకు, అవసరమైన విచారణ చేయుటకుఁగాను బ్రహ్మజిజ్ఞాసకు తగినవాఁ డగును. అందువలన మోక్షము లభించును. ఈ కారణములవలన వర్ణాశ్రమ ధర్మాచరణములు మోక్షమునకు పరంపరాబీజములుగా నున్నందున వీనిని బరిహరింపరాదు. వీనికర్మాచరణమును చేయకయే శుక ప్రహ్లాదాదు లతిబాల్యమునందే జ్ఞానులు కాలేదా యని శంకింతురేమో? యది సరికాదు. వారికి పూర్వజన్మములయందు కర్మ పరిపక్వమై యుండుటచే సులభముగా పునర్జన్మరాహిత్యమునకు హేతువగు జ్ఞానము కలవారైనారు గాని వేఱొకటి కాదు. జ్ఞానముకంటె భిన్నమైన దంతయు నధ్యారోపమే గనుక సగుణ బ్రహ్మోపాసనలవలన పొందు స్వరూపముకూడ నధ్యారోపమే యగుచున్నది. ఏమన, బ్రహ్మముకంటె నన్యము లేదనియు, బ్రహ్మము నిర్వికారుఁ డనియు నిదివఱకే సమర్థింపఁబడినది. శరీరమే లేనప్పుడు శరీరముయొక్క మఱియొక రూపము గాని, యవస్థలు గాని యుండుటకు వీలు లేదు. కర్మాచరణ మంతయు జ్ఞానమును కలిగించు చిత్తశుద్ధికిని, తద్వారా జ్ఞానోత్పత్తికిని సాధనసామగ్రియే కాని సత్యము కాదు. ఇట్టి యధ్యారోపమును నిశ్చయించుటయే అపవాద మనఁబడును. ఈ యధ్యారోప, అపవాదములు ఉపాసకునకు జ్ఞానము కలిగించు సౌకర్యార్థము చెప్పఁబడినవి. అందుచేతనే యీ పరమ సిద్ధాంతమతముచేఁ బూర్వపక్షమతము లిదివఱకుఁగనఁబడినరీతిని ఖండింపఁబడినవి. అయినను, ఆపూర్వపక్షమతములు జ్ఞానోత్పత్తికై తగినవి కాకపోయినను వానియం దుపదేశింపఁబడిన సాధనము లనుకూలముగా నుండవచ్చు నందురేమో? అది సరికాదు.

గమ్యస్థానమే లేనివానికి దానిమార్గములుగూడఁ దెలియుటయు నసంభవమే. ఈ సంగతి ప్రతిమనుజునకును ననుభవవేద్యమే గనుక విస్తరింపలేదు.

కాఁబట్టి యేమతమందు ప్రయోజన ముద్దేశింపఁబడెనో యామార్గముతో యాప్రయోజనమును గలిగించి యథార్థ నిశ్చయజ్ఞానమును బొందించును. అట్లు పొందింపలేని వన్నియు గమ్యస్థానము లేనివాఁడు పోవుమార్గములవంటి వగును. అందువలననే బ్రహ్మమును తెలిసికొనుటయే ప్రయోజనముగా లేని మతము లన్నియుఁ బూర్వపక్షములై యీ పరమసిద్ధాంతమత మొక్కటియే నిల్చినది. ఇది యనుభవైకవేద్యమును, అనుష్ఠానసాధ్యమును యథార్థమును నై యున్నది గాని శుష్కయుక్తులచేత సాధ్య మగునదియు కాదు. వానిచే పడిపోవునదియు కాదు. ఇందలి సంగతులు ప్రస్థానత్రయము ననుసరించియు, ననుభవజ్ఞులు కనిపెట్టి వ్రాసిన వ్రాఁతల సాహాయ్యముచేతను వ్రాసితిని గాని నా స్వకపోల కల్పితములు కావు. నేను సూత్రభాష్యము నుండియు, ఆంధ్ర శారీరకమునుండియు బ్రహ్మశ్రీ కొప్పాక వెంకట్రామయ్యగారివల్ల నేను నేర్చుకొని వ్రాసికొనియున్న యుపన్యాస సంగ్రహములనుండియు సర్వజనులకును మతమునుగుఱించి సాధ్యమైనంత సులభముగాఁ దెలియునట్లు లాయా గ్రంథకర్తల గ్రంథముల నుండి చాలసంగతుల నెత్తి సంగ్రహముగా వ్రాసినాఁడను. అందు గుణములను మాత్రము గ్రహించి దోషముల క్షమించి క్షీరనీరన్యాయమును నెరపుదురని పండితహంసలను ప్రార్థించుచున్నాఁడను.

ఓం తత్సత్

బ్రహ్మార్పణమస్తు.

| | | |
|---|---|---|
| ౧౧. ఈశ్వర దర్శనము:—ఇందు భక్తి జ్ఞాన వైరాగ్యాదులను దెలుపు విషయములను బహుగ్రంథములు శోధించి సయుక్తికముగా వ్రాయఁబడియున్నవి. ఇది సంస్కృతభాషలో నుండి క్రొత్తగాఁ దెలుఁగున నమృతధారవంటి వచనరచనతో నొప్పుచున్న నాలుగు పాదముల గ్రంథము. ఇట్టి దిదివఱకు మన తెలుఁగుదేశములో లేదను టతిశయోక్తి గాదు. ప్రతివారలును జదువఁదగినది. | 1 | 4 |
| ౧౨. డిటో డిటో కలికో | 1 | 8 |
| ౧౩. సనాతన ధర్మ ప్రశ్నోత్తరావళి, ౧ భాగము | 0 | 4 |
| ౧౪. స్నానమంత్రములు:—టీకా స్వరాది సమన్వితము | 0 | 3 |
| ౧౫. శ్రీసూక్తము:—టీక, స్వర, పురశ్చరణాదిసహితము | 0 | 4 |
| ౧౬. ఋగ్వేద సంధ్యాభాష్యము—సస్వరాంధ్ర తాత్పర్యము | 1 | 8 |
| ౧౭. నిత్యకర్మాష్టక పరిశిష్టము:—సస్వరాంధ్ర ప్రయోగము | 0 | 4 |
| ౧౮. సదాచారము:—సాంధ్ర తాత్పర్యము | 1 | 8 |
| ౧౯. డిటో కలికోబయిండు | 2 | 0 |
| ౨౦. పైతృమేధిక ప్రయోగము:—ధర్మశాస్త్ర కారికా సమేతము. యజుర్వేద, పైతృమేధకర్మకు సంబంధించిన అన్ని విషయములు వివరింపబడియున్నవి. | 2 | 8 |
| ౨౧. చారుచర్య, క్షేమేంద్రునిది సతాత్పర్యము | 0 | 4 |
| ౨౨. మునిభావబోధిని, సతాత్పర్యము | 2 | 8 |
| ౨౩. వేదాధ్యయన సంప్రదాయము | 0 | 4 |
| ౨౪. సనత్సుజాతీయము:—శంకరభాష్యాంధ్ర టీకాతాత్పర్య సహితము | 1 | 0 |
| ౨౫. మోక్షగుండరామాయణము, హరికథ | 3 | 0 |
| ౨౬. సర్వవేదాంగ సిద్ధాంత సారసంగ్రహము:—సటీక | 2 | 8 |
| ౨౭. ఆర్యధర్మ ప్రత్యక్ష ఫలబోధిని:—వచనము | 1 | 0 |
| ౨౮. కూష్మాండ గణహోమ సింహానువాకములు సతాత్పర్యము | 0 | 8 |
| ౨౯. ధర్మశాస్త్రసంగ్రహము, సతాత్పర్యము | 1 | 0 |
| ౩౦. లఘుకౌముది:—ఆంధ్రటీకాసహితము | 1 | 0 |

| | | |
|---|---|---|
| ౩౧. కైవల్యనవనీతము:—తనుపర్తి. వేంకటరామ శ్రీ విద్యానందనాథ విరచితము. టీకాతాత్పర్య విశేషార్థ సమన్వితము. ౫-వ ముద్రణము. వేదాంతగ్రంథము లందింత ప్రచారముగల గ్రంథము మఱియొకటిలేదు. తత్వబోధమను ౧ భాగము కలిసియుండు | 2 | 8 |
| ౩౨. డిటో సందేహనివారణమను ౨ భాగము ,, | 2 | 0 |
| ౩౩. ౧, ౨ భాగములు చేర్చి ఒకేబైండు | 4 | 0 |
| ౩౪. వసిష్ఠజనకసంవాదము:— వేదాంతగ్రంథరాజము | 0 | 12 |
| ౩౫. తెలుగు 'కురల్' అర్థకాండముమాత్రము:—సటీక | 2 | 8 |
| ౩౬. శాస్త్రీయ సంస్కారావశ్యకత:—వచనము | 0 | 5 |
| ౩౭. వేదాంతచంద్రిక, ౧ భాగము | 0 | 8 |
| ౩౮. మతదర్పణము | 0 | 4 |
| ౩౯. కొండవీటి సీమదండకవిలె:—వచనము | 0 | 6 |
| ౪౦. యోగాభ్యాసదర్పణము:—బ్రహ్మానంద సరస్వతీ యతీంద్రకృతము | 0 | 12 |
| ౪౧. గోత్రప్రవరసంగ్రహము:—గోత్రములనిననేమి? ప్రవరలనినయేమి? గోత్రఋషులకు ప్రవరఋషులకుగల సంబంధమేమి? యేయేగోత్రములవారు పరస్పరము వివాహసంబంధము చేసికొనకూడదు. మున్నగు అనేకవిషయము లిందుగలవు | 0 | 8 |
| ౪౨. ఆర్యవిద్యారహస్యము, వచనము | 1 | 8 |
| ౪౩. బ్రహ్మపురాణము, సవిమర్శము, వచనము. | 0 | 5 |
| ౪౪. శివరహస్యఖండము, వచనము. | 3 | 0 |

వలయువారు:—మేనేజరు - స్వధర్మప్రకాశిని.

బృందావనము, కీలుపాకు, మదరాసు అని వ్రాయవలయును.

Printed at the Sree Vedavelli Press, Choolai Madras.

స్సువలన ప్రాప్తమగునది కాదు. ఊర్ధ్వరేతస్సువలన పొందఁబడునది. అట్టి యూర్ధ్వరేతస్సు ముఖ్యకర్మమువలన జనించును. అట్టి ముఖ్యకర్మము శ్రౌత మనియు స్మార్త మనియు రెండువిధములు. బహిరింద్రియముల చేతఁ జేయఁబడునది శ్రౌత మనియును, నంతరింద్రియముల చేతఁ జేయఁబడునది స్మార్త మనియును జెప్పఁబడును. ఈ శ్రౌతస్మార్తకర్మములు నిత్యము లనియు, నైమిత్తికము లనియు, కామ్యము లనియు, ప్రాయశ్చిత్తము లనియు నాలుగుభాగములుగా నున్నవి. ఈ కర్మతంత్రము లోకములోఁ జేయఁబడు విధమంతయు గౌణమనఁబడును. ఇది యందఱికిని దెలిసినదియే గనుక విస్తరించలేదు. బ్రహ్మార్పణబుద్ధితో విధివిధానమున ప్రాణాగ్నియందు బహిరింద్రియములచేత చేయునట్టి హోమాదికము శ్రౌతము. అంతరింద్రియములచేత నదే రీతిగాఁ జేయఁబడునట్టి హోమాదికము స్మార్తము. గౌణకర్మము ముఖ్యకర్మముయొక్క ప్రతికృతి (Photograph) గాని వేఱుకాదు. ముఖ్యకర్మములు చేయునవి సద్వృత్తులనెడి దేవతలు. అట్టి కర్మము చేయకుండఁ జేయునవి దుర్వృత్తులు. అవియే రాక్షసులు. ముఖ్యకర్మాచరణమున నూర్ధ్వరేతోజనితుఁడగు మహాపురుషుఁడు ప్రకాశించును. అట్టిజీవులే యవతారములు. అట్టి యవతారపురుషుఁడుకూడ జాత్యాశ్రమాదిధర్మాచరణము చేయవలెను. ఆపురుషుఁడు సదా దేవతలకు సహాయుఁడై రాక్షసుల సంహరించుచుండును. ఆయనస్వరూపమే సగుణబ్రహ్మస్వరూపము. ఆస్వరూపమును పొందిన యుపాసకుఁడు నిష్కాముఁడై నిర్గుణ బ్రహ్మోపాసన చేయుటకు నర్హుఁడగును. అట్టి నిర్గుణోపాసనచే నతఁడు బ్రహ్మలోకప్రాప్తిని యర్చిరాదిమార్గమునఁ బొందును. అర్చిరాదిమార్గ మనఁగా నేఫలాపేక్షయు లేకుండ బ్రహ్మార్పణముగాఁ గర్మముల నాచరించుటచే బ్రహ్మలోకమును పొందించుమార్గము. ఉపాసకుఁడు నిష్కాముఁడు గాక యేదియో ఫల మపేక్షించుచుఁ గర్మములు చేయుట ధూమాదిమార్గము. అందుచే నుపాసకునకు స్వర్గలోకప్రాప్తికలుగును. స్వర్గలోక మనఁగా భోగము కలుగుస్థితి. బ్రహ్మలోక మనఁగా జ్ఞానము కలుగుస్థితి. ఈ రెండును నూర్ధ్వగతిలోనివే గనుక నేది కలుగకపోయినను, ఉపాసకుఁ డధోగతి పాలగును. ఈ విధముగా బ్రహ్మవిద్యోపాసన చేయుటచే చిత్తశుద్ధి కలుగును. కాని మఱియొక